సంవత్సర చందా
రు 12-0-0
విడిప్రతిక 4 అ

# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

**Founder K. NAGESWARA RAO**

సంపుటము 40
సంచిక 18
**4-1-56**

మన్మథ మార్గశిర బహుళ సప్తమి బుధవారం



సోవియట్ రష్యా కానుకగా పంపిన వ్యవసాయయంత్రాలను, రాయబారి మెన్సికోవ్, భారతప్రధాని శ్రీ నెహ్రూకు ఇటీవల సమర్పించారు. ఆధునికయంత్రం అమర్చిన కొత్తరకం నాగలిని ఈ చిత్రంలో చూడవచ్చు.

# విషయానుక్రమణిక

ఉజ్బెక్ కళాకారుల గౌరవార్థం డిసెంబరు 21 న ఢిల్లీలోని తాల్‌కటోరా ఉద్యానవనంలో గోపికా నృత్యం ప్రదర్శించబడింది.



ప్రభుత్వ చలనచిత్రనిర్మాణశాఖ నిర్మించిన, డాక్యుమెంటరీ 'పవర్ ఆఫ్ ది లూం'కు రాష్ట్రపతి డా॥ రాజేంద్ర ప్రసాద్ సువర్ణపతకం లభించింది ఈ చిత్రంతో ఈ బహుమతి సంపాదించుకున్నవారు ఆశాఖ

# గురు పరీక్ష

"తమ సన్నిధిని సాంగ వేదాధ్యయనం చేదామని వచ్చాను" అన్నాడు ఉపమన్యుడు సవినయంగా చేతులుజోడించి.

ధౌమ్యుని ఆశ్రమంలో ఆకాశం అంత మర్రిచెట్టు నీడలో కూర్చుని యజ్ఞోపవీతాలు వేళ్ళకు చుట్టుకుంటూ వేదాలు వల్లెవేస్తున్న శిష్యులంతా కళ్ళెత్తి ఒక్క క్షణం ఆ ఉపమన్యునికేసి చూశారు. ఆ అనవసర ప్రమేయం తమ కెందుకనుకున్నారేమో! మళ్ళీ కళ్ళు వాల్చి తమ వేదాధ్యయనంలో పడ్డారు.

ధౌమ్య మహర్షి రుద్రాక్షమాల మెల్లిగా వేళ్ళ సందులలోనుంచి జారవిడుస్తూ హేలగా ఆ కొత్త వటువును పరకాయించాడు.

మహర్షి కన్నులు చాలా చిన్నవి. కాని చూపులు మాత్రం సూదులు! దట్టంగా గుబురులుగా పెరిగిన కనుబొమ్మలు! తెల్లగా దూదిపింజలా నెరిసిన గడ్డం ఎడంచేతి మునివేళ్ళతో తడుముతూ మహర్షి ఒక్క నిట్టూర్పు విడిచాడు.

ఉపమన్యుడలాగే నిలబడి ఉన్నాడు.

"ఈ సాంగ వేదాధ్యయనం అసిధారా వ్రతం!" అన్నాడు ధౌమ్యుడు.

ఉపమన్యుడెంతో ఆత్రంగా ఆచార్యుని నోట వెలువడిన మాటలు విన్నాడు. అలాగ మరికొన్ని క్షణాలు గడిచిపోయాయి.

"సరే! ప్రతిదినము ఆవుల్ని అడివికి తోలుకు వెళ్ళి, జాగ్రత్తగా కాస్తుండాలి మరి!" అన్నాడు ధౌమ్యుడు. అంతేగాని వేదాధ్యయనం సంగతే స్మరించలేదా ఆచార్యుడు! అయినా ఉపమన్యుడా మాటకే ఎంతో ఆనందించాడు.

మరునాడు పొద్దున్న ఆశ్రమంలో చెట్ల నీడలు మెల్లిగా మేలుకునే సరికే ఉపమన్యుడు ఆవుల్ని అడివిలోకి తోలుకుపోయాడు. మళ్ళీ దీపదీపాలవేళ ఆవులమందతో ఆశ్రమానికి తిరిగి వచ్చాడు!

"ఉపమన్యూ! మధ్యాహ్నం భోజనానికి మళ్ళీ ఆశ్రమానికి తిరిగి రాలేదా?"

"లేదు!"

"అయినా అలిసినట్లు కనబడడం లేదే!"

"అరణ్యంలో మహర్షుల ఇళ్ళవద్ద మాధుకరం ఎత్తుకున్నాను!"

ధౌమ్యుడు ఉపమన్యుని కేసి ఉరిమినట్లు చూసి—"ఆచార్యునికి నివేదన చెయ్యనిదే ఆ ఆహారం స్వీకరించవచ్చునా? ఎంతటి అపచారం!" అన్నాడు.

మరునాడు శిష్యుడు మాధుకరం ఎత్తి తెచ్చిన అన్నం అంతా గురుదేవునికే అర్పించాడు. దానిలో తానొక్క మెతుకైనా ముట్టలేదు. అయినా సాయంత్రం అయ్యేసరికి ఆవుల మంద వెంటబెట్టుకుని, యథాప్రకారంగా ఆడుతూ పాడుతూ ఆశ్రమానికి చేరుకున్నాడు. ఉపమన్యుడానాడు కూడా ఏమీ నీరసపడినట్లు కనిపించలేదు! ధౌమ్యుడు తిరిగీ దానికి హేతువేమని ప్రశ్నించాడు.

"మీకు భిక్షాన్నం నివేదించిన తరవాత ఇంకొకమారు మాధుకరం ఎత్తుకొన్నాను!"

"అది ధర్మ విరుద్ధం! ఇతర బ్రహ్మచారుల భిక్షలకు అడ్డు రావచ్చునా?"

ఉపమన్యుడు తలవంచుకు వెళ్ళిపోయాడు. ఇంక మరి మాధుకరం ఎత్తుకోవడమే మానివేశాడు.

అలాగ కొంత కాలం గడిచిపోయింది. క్రమంగా ఎండ లెక్కువై ముందు వేసవిగా మారిపోయాయి. అడవుల్లో అంటుకున్న దావాగ్నులు రాత్రింబగళ్ళలాగే నిత్యాగ్నిహోత్రాల్లాగ అఖండంగా వెలిగిపోతున్నాయి! పండుటాకులు, ఎండుటాకులు గాలిలో కలిసి గలగల్లాడుతూ ఆకాశంలో సుళ్లు తిరుగుతున్నాయి. ఆవుల మందలు అడవిలోకి వెళ్ళగానే కొంచెంసేపే పచ్చిక మేసి వెంటనే చెట్ల నీడల్లో పడుకుని బ్రాగన్ను పెట్టి నెమరులు వేసుకుంటున్నాయి. నీరెండిపోయిన సెలయేళ్ళ ఇసుక తిన్నెల్లో మిగిలిన వట్టి ఎండమావులే జలప్రవాహాల్లాగ తళతళ మెరుస్తున్నాయి. పాపం! అడివిలో లేళ్ళన్నీ అవే మంచినీళ్ళనుకొని అక్కడికి పరుగెత్తుకువచ్చి కళ్లు తిరిగి నురగలు గక్కుకుంటూ పడిపోతున్నాయి!

ఆ వేసవిలో కూడా ఉపమన్యుడలాగే తెల్లవారే వేళ ఆవుల మందతో అడివికి పోయేవాడు. సూర్యాస్తమయం కణకణలాగే చింత నిప్పులా మెరిసే సమయానికి ఆలమందతో ఆశ్రమానికి చేరుకునేవాడు. అయినా అతని ముఖంలో ఎక్కడా అలసినజాడే కనబడేదికాదు!

ప్రాచీన గాథాలహరి

ఆచార్యునికిది చాలా వింతగా తోచింది.

ఒకనాడు ఒక చిన్న లేగదూడ నెత్తుకుని మందతో తిరిగి వచ్చిన ఉపమన్యుని ఓరగంట చూచి ఇలాగన్నాడు.

"ఉపమన్యూ! మాధుకరం మానివేసినా మాంచి మదించిన వృషభంలాగే ఉన్నావే! ఏమిటీ అద్భుతం!"

శిష్యుడు కొంచెం తటపటాయించి సమాధానం చెప్పాడు.

"అప్పుడప్పుడు కొంచెం గోక్షీరం పుచ్చుకుంటున్నాను."

ఆ మాట వినబడేసరికి ఆచార్యుని రెండు కళ్ళూ రెండు మిణుగురు పురుగుల్లా మెరిసిపోయాయి. ఉపమన్యుపై ఒక్కసారి విరుచుకు పడ్డాడు.

"గురుద్రోహీ! గుర్వాజ్ఞలేనిదే—గురుద్రవ్యం అపహరించిన నీ ముఖం మరి చూడకూడదు! నా ఎదుట నిలబడకు! పో!"

ఉపమన్యుని నోట మాట పెగల్లేదు!

పి. గణపతిశాస్త్రి

తాలూకు పిడచగట్టుకపోయింది. ఆచార్యుని కాళ్లమీదపడి తన అపచారం మన్నించవలసిందని పరిపరి విధాల బ్రతిమాలుకున్నాడు.

ఆ ఆచార్యుని కోపం హారతి కర్పూరం. ఇట్టే మండి చల్లారిపోతుంది ఇలాంటి అపృచ్ఛపు పనులెన్నడూ చేయవద్దని హెచ్చరిక చేసి ఆనాటికతన్ని విడిచి పెట్టాడు.

అలాగ అహర్నిశలు గడిచిపోతున్నాయి. మిగిలిన శిష్యులంతా ఆచార్యుని ఆశ్రమంలోను, మునిపల్లెలోను, హాయిగా మాధుకరం ఆరగిస్తూ వేదాలు వల్లె వేస్తున్నారు. ఇతర శిష్యులెవరూ ఉపమన్యునితో అంతగా అన్యోన్యంగా సంభాషించడమే లేదు! ఒక్క గురుపత్ని మాత్రమే అప్పుడప్పుడాచార్యుని కంటపడకుండా అతనికి కొన్ని చిన్న కంద మూల ఫలాలందిస్తూండేది.

ఆ సమయంలో ఉపమన్యునికి దూరంగా ఎక్కడో మునిపల్లెలో ఉన్న తల్లిదండ్రులొక్కసారిగా జ్ఞాపకం వచ్చేవారు. వెంటనే అతని కళ్ళు చెమ్మగిలేవి.

అత డాశ్రమానికి వచ్చిన తరవాత హేమంత శిశిర వసంత ఋతువులు మూడు గడిచిపోయాయి ఇక గ్రీష్మం కూడా చాలా వరకు గడిచిపోయినట్టే! కాని ఎండలింకా చండ్రనిప్పులు చెరిగిపోస్తూనే ఉన్నాయి.

ధౌమ్యాచార్యుడెంత కాఠిన్యం వహించినట్టున్నా ఉపమన్యుడాయనకెంతో భయభక్తులతో పరిచర్యలు చేస్తుండేవాడు. ఒక్కనాడు వేళ తప్పకుండా ఆవుల్ని అడవికి తీసుకుపోతూ, జాగ్రత్తగా వాటికి సంరక్షణ చేసేవాడు. అందులోను లేగలంటే అతనికి ప్రాణం. వాటినెంతో వాత్సల్యంతో ఆదరించేవాడు. అవి అతడు పక్కన లేకపోతే పాలుకూడా కుడుచుకునేవి కావు!

ఒకనాడు అరణ్యంలో ఎక్కడచూచినా దావాగ్ని పొగలే! దానికి తోడుగా కణకణలాడే మండుటెండలో గాలి కొంచెం చూచాయగా వీచి, ఒక్కసారిగా ఆగిపోయింది. సాయంత్రం అయినా గాలి అలికిడి వినిపించలేదు. చెట్లమీద కాకులు నోళ్లెండిపోయి కావుకావని అరుస్తున్నాయి మృగాలు ఆ ఎండవేడిమికీ,దప్పికకూ తట్టుకోలేక తమతమ శత్రుభావం కూడా మరిచిపోయి పక్క పక్క పొదల్లో దాక్కుని ప్రాణాలు నిలబెట్టుకుంటున్నాయి. కొంచెం చీకటి పడింది. ఋషివాటికలో గారకాయల నూనె ప్రమిదలలో పోసి వెలిగించిన చిన్న చిన్న దీపాలక్కడక్కడ మిణుకుమిణుకు మంటున్నాయి దూరంగా సాయంకాల హోమమంత్రాలు గంభీరంగా వినిపిస్తున్నాయి.

ముందుగా గోవు లొక్కటొక్కటే ఆశ్రమానికి చేరుకున్నాయి. వాటికి కొంత దూరంలో ఉపమన్యుడున్నాడు అత డాశ్రమానికి వస్తూనే ధౌమ్యునికి సాష్టాంగ నమస్కారం చేశాడు.

ఈనాడుకూడా అతడంతగా అలసిపోయినట్టు కనపడలేదు. ధౌమ్యునికి ఆశ్చర్యం వేసింది! వెంటనే అరికాలిమంట నెత్తికెక్కింది! అయినా కోపం లోపలనే అణుచుకుని ప్రశాంతంగా కారణమేమిటని అడిగాడు. ప్రక్కనే గురుపత్ని పర్ణశాల ద్వారం వెనక నిలబడి ఉంది ఆమె ముసిలి పండు ముత్తయిదువు! అయినా ధౌమ్యుని కెదుట నిలబడడానికింకా ఆమెకు భయమే!

ఉపమన్యునికి ఊపిరాడలేదు. ఒక్కొక్క మాటే తడుముకుంటూ హడిలిపోతూ ఇలాగ విన్నవించుకొన్నాడు

"ఈ వేళ నేనేమీ అపచారం చెయ్యలేదు. అడివిలో లేగలు పాలు కుడుచుకుంటూంటే—పాల నురగలు రాలితే, అవి మాత్రమే ఆరగించి ప్రాణాలు నిలబెట్టుకున్నాను."

ధౌమ్యుడు ఎత్తిపొడుపుగా ఒక పెద్ద నవ్వు నవ్వి—

"ఎంత ఇంద్రజాలం కల్పించావు!" అన్నాడు.

ఉపమన్యుడు నిర్ఘాంతపోయి, కాలి బొటన వేలుతో నేలమీద రాస్తూ తలవంచుకున్నాడు.

"ఆ లేగలన్నిటినీ మాయచేసి,మచ్చిక చేసి—పాపం! అవి తాగే పాలుకూడా తాగివేస్తున్నావా!" అన్నాడు ధౌమ్యుడు!

ఉపమన్యుడు మాయా, చెయ్యలేదు; మచ్చికా చెయ్యలేదు! కాని ఆ లేగలు కూడా అతనికష్టసుఖాలు తెలుసుకున్నాయి. తాము పాలుతాగేటప్పుడతనికింకా ఎక్కువగా పాలనురగ రాలేటట్లు పాలు కుడుచుకునేవి! ఉపమన్యుడు వాటినెంతో వాత్సల్యంతో అన్నదమ్ముల్లా ఆదరించేవాడు! అడివిలో లేగలతని మాటలర్థం చేసుకుని పలకరిస్తున్నట్లుగానే అతనితో కలిసిమెలిసి తిరుగుతూ గంతులువేస్తూ ఆడుకునేవి. ఆచార్యుడొక్క చూపులో అదంతా

## సిగరెట్ కథ

సిగరెట్లు వ్యాప్తిలోకి వచ్చి దాదాపు వంద ఏళ్ళపైగా అయింది. అల్జీర్స్ దేశంలో పొగాకును జొన్న ఆకుల్లో చుట్టి కాల్చడంచూసి ఫ్రెంచి సైనికులు కూడా అదే చెయ్యడం మొదలెట్టారని కొందరి వాదం. అది కాదు, స్పెయిన్‌లో మొదట సిగరెట్లు జన్మించాయని మరికొందరి వాదం. మొట్టమొదటి సిగరెట్ ఫ్యాక్టరీ ఫ్రాన్సులో 1843 లో స్థాపింపబడింది తరవాత ఇంగ్లండుకు కూడా సిగరెట్ల అలవాటు ప్రాకింది. నవలా రచయిత చార్లెస్ డికెన్స్ అస్తమానం సిగరెట్లు కాల్చేవాడట. 1870 నాటికి సిగరెట్ల అలవాటు చాలా మందికి పట్టుకుంది.

గ్రహించుకొన్నాడు. కాని ఒళ్ళెరగం కోపంతో అతన్ని మాయచేశావని నిందించాడు!

ఉపమన్యుని కెంతో మధనపడ్డా తనతప్పిదం కనపడలేదు! ఆచార్యుని కాఠిన్యం మాత్రమే పెద్ద పర్వతంలా ప్రత్యక్షమయింది. అయినా ఏమనడానికీ పాలుపోక ఎంతో దైన్యంతో ఆచార్యుని కళ్ళకేసి చూస్తూ—

"ఎంత మథనపడినా నేను చేసిన అపచారమేమో గోచరించడం లేదు!" అన్నాడు.

ఆచార్యుని కళ్లు జేవురించాయి!

"అయితే నేనే అనృతవాదినన్నమాట!"

"నేనా మాట ఉచ్చరించనే లేదు." అన్నాడు ఉపమన్యుడు తిరిగి సవినయంగా.

ఆ వినయం మరి భరించలేకపోయాడు ధౌమ్యుడు.

మళ్ళీ కళ్ళల్లో నిప్పులు చెరుగుతూ—

"నీవు నాకే ధర్మబోధ చేస్తున్నావే!

# ★ గురుపరీక్ష ★

చాలు! చాలు! నీ అధ్యయనం! పో! నా ఎదుటనించి!" అన్నాడు.

ఉపమన్యుడు వంచిన తల ఎత్తలేదు!

అతని కళ్ళమ్మట జలజలా బాష్పధారలు ప్రవహించాయి.

పక్కనించి ఇది చూస్తున్న గురుపత్ని గుండె తరుక్కుపోయింది. వెంటనే ఇవతలికి వచ్చి, ఉపమన్యుని చిన్ని జులపాలు చేతితో దువ్వుతూ "అయ్యో! ఇదేమిటో రాక్షసత్వం! పాపం! పసివాణ్ణెన్ని విధాల హింసిస్తున్నారు!" అన్నది ఆచార్యునితో.

ధౌమ్యుడామె కేసి శపించేటట్లు చూశాడు!

"అయ్యో! నా చిట్టి తండ్రీ! పాలనురగలకల్ల కడుపెం నింపుతుంది నాయనా! రా! కొంచెం నివరి అన్నం తిందువుగాని!" అన్నది వాత్సల్యం ఉట్టిపడేటట్టు!

ధౌమ్యుడామె మాటలు విని ఆజ్యధార పోసిన అగ్నిహోత్రంలా మండిపడ్డాడు.

"నీవే! దీనికంతటికీ మూలకారణం! నీ మూలానే ఇంతటివాడికింతటి ధిక్కారం బలిసిపోయింది. ఇక నేనిది భరించలేను! ...పొండి! మీ ఇద్దరు నాయెదటనుంచి... ఎంతటి గురుధిక్కారం! ఎంతటి అహంకారం!"

ఇద్దరు అతని ఎదుట తలవంచుకొని అలాగే నిలబడ్డారు. కాని ఎవరూ అక్కడినుంచి కదలలేదు!

వారిని ఎదురుగా చూస్తూన్న కొద్దీ



ఆవులకాపరి ఉపమన్యుడు

చిత్రకారుడు: పి. ఎల్. నరసింహమూర్తి

"నేను మానవజాతి అంతటికీ చెందినవాణ్ణి. ప్రపంచంలో మానవుడు ఎక్కడెక్కడున్నా అతడు నా వాడే. నేను ఇంగ్లండులో జన్మించానంటే, దాని బాధ్యత నాది కాదు, నా తల్లిగారిది."

—చార్లీ చాప్లిన్.

ధౌమ్యునికి నఖశిఖ పర్యంతము కోపాగ్ని జ్వాలలు ప్రజ్వలించాయి.

"ఏం ఇద్దరు ఇక నా ఎదటనుంచి కదలరా!" అని ధౌమ్యుడొక్క ఉరుము ఉరిమాడు!

అంతే మరుక్షణంలో చేతిలోని జపమాల నేలకు వేసి కొట్టి ఒక్క అంగలో అక్కడినుంచి వెళ్ళిపోయాడు!

క్రమంగా అప్పటికే ఆకాశంమీద దట్టంగా కారుమబ్బులు పట్టాయి! ఒక్కసారి ఫెళ ఫెళ గర్జనలతో కుండపోతగా వర్షం కురవడం ప్రారంభమైనది!

ఆచార్యుని వెనువెంటనే ఆచార్య భార్యకూడా అక్కడినించి వెళ్ళిపోయింది ఉపమన్యుడొక్కసారిగా అక్కడనే కుప్పగా కూలబడి పోయాడు

ఆచార్యుని భార్య ధౌమ్యునిపాదాల మీద పడి ఎంతో ప్రతిమాలుకొన్నది. అటు తరవాత ఎట్టకేలకు ధౌమ్యుడు తిరిగీ ఉపమన్యుడు గోవులను అడవికి తీసుకుపోవడాని కంగీకరించాడు. అతని కోపమే అంతటిది!

అలాగ రెండుమూడువార్నిశలు తిరిగిపోయాయి ఆనాడు ఆకాశం అంతటా దటంగా మబ్బు పట్టింది. సాయంకాలం దాటిపోయింది అయినా ఉపమన్యుడు పర్ణశాలకు తిరిగిరాలేదు కొంతసేపటికి గోవులు, గోవత్సాలు "అంభా" అని అరుస్తూ ఒక్కటొక్కటే ఆశ్రమానికి మరలివచ్చాయి· ఒక్క గోవు, గోవత్సము మాత్రం తిరిగి రాలేదు! వాటితోబాటు ఉపమన్యుడూ రాలేదు!

గురుపత్నికి మరి కాళ్ళాడలేదు. మాటిమాటికి పర్ణశాలద్వారందగ్గరికి వెళ్లిచూచింది బాగా చీకటిపడింది! ఇంకా ఉపమన్యుడు రాలేదు! కీచురాళ్ళ మోతలు కూడా ప్రారంభమైనాయి! అయినా కనుమాపు మేరలో ఎక్కడా అతడు కానరాలేదు!

ధౌమ్యుడు ఉలకకుండా పలకకుండా అలాగే అగ్నిహోత్రంలో హోమం చేస్తున్నాడు.

గురుపత్ని ఇక నిలవలేక అడవికి ప్రయాణమయింది. ధౌమ్యుడిక చేసేది లేక తానూ బయలుదేరాడు. శిష్యులుకూడా వారివెంట పడ్డారు.

అందరూ అడివి అంతటా గాలించారు! ఎక్కడా ఉపమన్యుని జాడ కనబడలేదు! ఆచార్యపత్ని "ఓఉపమన్యూ!"అని ఎలుగెత్తి పిలిచింది. ధౌమ్యుడుకూడా మేఘగంభీర స్వరంతో "ఓఉపమన్యూ!" అని పిలిచారు. శిష్యులంతా ఒక్కగొంతుతో "ఓఉపమన్యూ!" అని పిలిచారు!

వారి కేకలకు ప్రతిధ్వనించిన కొండగుహలన్నీ "ఉపమన్యూ!" అని ఎంతో ఆప్యాయంగా పిలిచాయి! చెట్టుకొమ్మలమీద పురివిప్పినిలబడిన నెమళ్లన్నీ "ఉపమన్యూ" అని కేకలు వేశాయి! అలాగే అర్ధరాత్రిదాకా కేకలు వేశారు. ఎక్కడా ఉపమన్యునిజాడే పొడగట్టలేదు!

చివరికి అందరు ఒక్కగొంతుతో "ఉపమన్యూ!" అని గంభీరంగా గర్జించినట్లు పిలిచారు.

ఇంతలో ఎక్కడో ఒక్క లేగ 'అంభా' అని అరిచింది వెంటనే అపక్కన అవు అంతకన్న గట్టిగా 'అంభా' అని అరిచింది.

అందరు అటువైపు పరిగెత్తారు. ఒక పాడు దిగుడుబావిదగ్గర ఒక లేగ, అవు నిలబడి 'అంభా' 'అంభా!' అని అరుస్తున్నాయి. అందరు అక్కడికి వెళ్లారు. ఉపమన్యుడా దిగుడుబావిఒడ్డు పట్టుకుని నీరసంగా మూలుగుతున్నాడు!

వెంటనే శిష్యులతన్ని పైకి తీశారు. ఆచార్యపత్ని అతన్ని గుండెల్లో పొదువుకొని నారచీర చెరగుతో ఒళ్ళంతా తుడిచి కూడా తీసుకువచ్చి చిక్కని గోక్షీరపాత్ర నోటికందించింది. ఉపమన్యుడాపాలన్నీ ఒక గుక్కలో తాగి కొంతసేద తేరాడు. ఆవు, లేగ ఇదిచూచి తోకలెత్తి ఇంకా గట్టిగా 'అంభా' అని అరిచాయి! ఇదంతా చూస్తున్న ధౌమ్యుని రెండుకళ్ళమ్మట కన్నీరు పాలమున్నీరై సంతతధారగా ప్రవహించింది! ఆచార్యుడతన్ని ఎంతో ఆప్యాయంగా దగ్గరకు తీసుకుని -

"ఏమినాయనా! ఇంతటి ఘోరవిపత్తులో చిక్కుకొన్నావు?" అన్నాడు.

ఉపమన్యుడిలాంటి ఆదరవాక్యాలు వినడానికిదే మొదలు! అందుచేత కొంచెం ధైర్యం తెచ్చుకొని "నే నీరెండుమూడు రోజులనించీ జిల్లేడాకులతో నే ప్రాణాలు నిలబెట్టుకొంటున్నాను. ఆ పాలతో నే గొంతుక తడుపుకుంటున్నాను. ఎందువల్లనో నా దృష్టి పోయింది. తిరిగివస్తూ ఈ దిగుడుబావిలో పడిపోయినాను. నా అపరాధం మన్నించాలి!" అన్నాడు.

అందరు ఒక్కసారిగా ఆ ఉపమన్యుని కళ్ళుకని చూశారు. ఉపమన్యుడు కళ్లుతెరిచి అందరినీ తిలకిస్తూనే ఉన్నాడు. అయినా అవి వెర్రిమాపులు! గురుపత్ని ఇది గ్రహించుకుని మళ్ళీ అతని జానపాలు వేళ్లతో సవరిస్తూ దగ్గరికి తీసుకుని ఆచార్యునివైపు తెప్ప

(47-వ పేజీ చూడండి)

* సముద్రంమీద ఉన్నప్పుడు ఉరుము వినిపించదు.

* విమానంలో చాలాఎత్తు ఎగిరిపోతే ఇంద్రధనుస్సు వలయాకారంగా కనిపిస్తుంది.

* ఆవులు ప్రతి 8 గంటలకీ దూడలకు పాలివ్వగోరుతాయి.

* మొట్టమొదట్లో ఎడ్లను నాగలికి కట్టినప్పుడు, అవి కొమ్ములతో నాగలిలాగుతూ దున్నేవి.

* మనిషి బాగా అన్నం తిన్నప్పటికంటె ఉపవాసం చేసినప్పుడే ఎక్కువ బరువు తూగుతాడు.

* ప్రపంచంలో నూరేళ్ళ వయస్సువారిలోని సగంమంది బల్గేరియాలో ఉంటారు.

* "రష్యాను ఇప్పటివాకా ఎవరూ సరిగా అర్థంచేసుకున్నట్టు కనబడదు. రష్యా ప్రధానంగా కమ్యూనిస్టు దేశం," అని 1842 లో ఫ్రెంచి చరిత్రకారుడు మైకెలెట్ వ్రాశాడు.

# ఆ చేతి చేత....

అమ్మ వంట చేస్తూ ఉండగానే, అక్కడ తారట్లాడి, ఆవిడ కన్ను మరగేసి వత్తుల పెట్లో డబ్బులు చెక్కెయ్యడంలో భీమశంకరం గారు చిన్నప్పుడు సిద్ధహస్తుడు. ఆరోజుల్లో వెనకబడ్డ స్నేహితులకు ఈ విద్య కిటుకులు ఉపదేశించి గురువనిపించుకున్నాడు. బడిఎగేసి కాలవగట్లవెంట బీడీలు కాలుస్తూ రోజుల తరబడి తిరిగినా గోడ కట్టినట్టు అబద్ధాలు చెప్పి ఎవరికీ అంకకుండా నిభాయించుకోగలిగిన సాటిలేని మేటి మొనగాడు. దరిమిలా పెద్దవాడయ్యాక, ఆఫీసుకు, చెప్పిన జబ్బు చెప్పకుండా సెలవుపెట్టి నెగ్గుకొచ్చిన ధీశాలి. ఇంగ్లీషు పుస్తకాల సలహాలతో ఇంకా ఎన్నో పరిస్థితులకు తట్టుకోవడం, సమస్యలను ఎదుర్కోవడం, ఎదిర్చి నిలబడడం, నిలచి పరిష్కరించడం నేర్చుకున్నాడు. అనేక గొప్ప విద్యలలాగే ఇదీ క్రమేపీ రూపుమాసింది. ఆ రోజులు వెళ్లి పోయాయి.

అంతటి భీమశంకరం గారు ఏభయ్యో పడిలో పడ్డాక, ఒక ఆదివారంనాడు ఎదుట గోళ్లు గిల్లుకుంటూ కూర్చున్న పాతికేళ్ళ కుమారరత్నం వంక బాధగా చూస్తూ పడక కుర్చీలో పడుకుని సతమతమవుతున్నాడు.

"దబేస్తోందని చెప్పి చూడరా నాయనా" అన్నాడు చివరకి.

"కాలువా కప్పుకోమందండి. లేపోతే పానిట్లో కొచ్చి పడుకోమంటోందండి." అన్నాడు కుమారుడు వినయంగా.

"అఘోరించకపోయింది ... అయినా కాపోయినా ఏం మహిళలురా అబ్బాయి. ప్రాణాలు తోడేస్తున్నారనుకో. మొగుడు వెధవకి ఆదివారం పూటకాస్త ఊళ్లోకెళ్ళడానికి వీళ్ళనిఘా ఏమిట్రా" అన్నాడు భీమశంకరం గారు ప్రాణం విసుగెత్తిపోయి.

కొడుకు తల వంచుకున్నాడు మాట్లాడకుండా.

"టైమెంతయిందిరా?"

"మూడున్నరండి"

"అయ్య బాబోయ్ రైలుకింక గంటన్నర ఉందన్న మాట" అన్నాడు భీమశంకరం గారు.

ఆయన ఆ ఉదయం 9 గంటలనించి మూడున్నర వరకూ పదిసార్లు టైమడిగి తొమ్మిది సార్లు అయ్యబాబోయ్ అన్నాడు. ఒక సారి అబ్బా అప్పుడే రెండయిందిరా అన్నాడు. క్రితం రాత్రి తొమ్మిదినుండి ఆరోజు ఉదయం 7 గంటల వరకూ, కొడుక్కి డబ్బివ్వమనీ, 7 నుండి 9 వరకూ, తన పంచె, చొక్కా కండువా తన ముఖాన తగలెయ్యమనీ భార్యను పరిపరివిధాల బతిమాలుతూ వచ్చాడు.

ఆరుమూడయేదిమూడుఆరయేది 'ఆయా భై' మాత్రం ఇచ్చేది లేదని ఆవిడ ఖరారుగా చెప్పేసింది. "కట్నం లేకుండా పిల్లని చేసుకున్నాంకదా. ఆ మాత్రం అల్లుడు గదా అని ఓ నూటపదార్లు పండుగ పేరు చెప్పి వాళ్లివ్వరాదా. మన వెధవ, పెళ్లాం చేత అడిగించ రాదా." ఆవిడ రాత్రి గట్టిగా అనేసింది.

మెల్లిగా వెధవా అంటే గట్టిగా ముండ అనే తరహా మనిషి భీమశంకరం గారి భార్య.

పండక్కి అత్తారింటికెళ్ళి మళ్ళా పట్నం వెళ్తూ కొడుకూ కోడలూ ఇక్కడ దిగారు. ఓ నెల జీతం ముందే తీసుకుని ప్రయాణాలకు ఖర్చు పెట్టేసినందువల్ల, పట్నంలో కొంప చేరగానే అవగింజ దగ్గర్నుంచి తడుముకోవాలని బండి దిగిన గంటలో కొడుకు విన్నవించుకున్నాడు. ఉన్న డబ్బు రైలుకి కటాకటిగా సరిపోతుందని కూడా చెప్పుకున్నాడు. భీమశంకరం గారి గుండె కరిగిపోయింది. ఆయనభార్య ససేమిరా కానీ ఇవ్వడానికి వల్లకాదంది. ఆపాటి జాలి తనకీ ఉందనికూడా చెప్పింది. అవతల కొడుకూ కోడలు విని ఏమనుకొంటారో అని భీమశంకరం గారి బెంగ.

"సరేలే నువ్వు ఇవ్వద్దు పొద్దున నేనే చూసుకుంటా" అన్నాడు చాల గంభీరంగా.

ఆదివారం ఉదయం ఆయన లేచి అప్పుకు వెళ్ళబోయేసరికి, చొక్కా పంచె, కండువా కనబడలేదు పెట్టె తాళం వేసుంది.

"ఔనే. నా చొక్కా ఏదీ?" అంటూ వంటింట్లోకి వెళ్ళాడు.

'ముందు స్నానం చెయ్యండి' అందామె.

శంకరం గారు స్నానం చేసి కట్టుకున్న పంచె తడిపేశాడు. ఓ అంగవస్త్రం, తువ్వాలూ అందించిందావిడ. అవి కట్టుకుని, దేవుడికి దీపం వెలిగించి, ఓ పువ్వు ముక్క పడేసి లేచాడు. ఉట్టి వెనక చిలక కొయ్యకి తగిలించి ఉన్నాయి తన ఆఫీసు దుస్తులు. కాస్త ఆశ్చర్యపడుతూ తీసుకోబోయే సరికి "ఆగండి. ఆదివారం పూట ఎక్కడికెళ్తారు!" అందామె.

'పనుంది'

"నాకు తెలుసు ఆ రాచకార్యం. మీరేం వాడికి డబ్బు తెచ్చివ్వక్కర్లేదు. అంత అవసరమయితే ఇక్కడింకో రోజు ఉండి, అత్తారింటినించి తిరిగి టపామీద తెప్పించుకోమనండి"

"అది కాదే..."

"మీరు ముందు వీధరుగు మీద కెళ్ళి కూర్చుని పేపరు చదువుకోండి నాకుపనుంది. పాలకాయలు జంతికలు చెయ్యాలి."

శంకరం గారు నోరు మూసుకుని వీధరుగు మీద కెళ్ళి పోయాడు

కొడుకు అక్కడే కూర్చుని ఆలోచిస్తున్నాడు

ఎన్నడూ నోరెత్తి అడగనివాడు ఇన్నాళ్లకి తనని అడగడం తను ఇవ్వలేని పరిస్థితిలో పడడం చాలా బాధ కలిగించింది శంకరం గారికి.

"బాబూ ఇవాళ్టికాగి, రేపు వెళ్లరాదు

"అబ్బాయి మొహం అణా ఇడ్డెనంత అయిందే?" అంది శంకరంగారి భార్య.

"కోడలు పిల్ల ఊహూ ముసిముసి నవ్వులు నవ్వుతోంది. ఏం కథ తెగించి ఓ పావలా కాసుని నా చేతిలో పెట్టావా?" అన్నాడు శంకరంగారు హేళనగా.

రా. ఇవాళ ఆదివారం. ఆఫీసు జరుగుతుంది కాదు" అన్నాడు ఎంతో లాలనగా.

"లేదండి నాన్నగారూ రేపే జాయినయిపోవాలి."

శంకరంగారు దిగాలుగా కూలబడ్డాడు కుర్చీలో. తను ఒక్కడుగు అలా వెళ్లొస్తే ఎవడి కాళ్లో కొట్టి యాభై కాదు వందైనా పుట్టించవచ్చునని ఆశఉంది. కాని, ఇంట్లో ఆడది మొండికెత్తిపోయి, తన చొక్కా పంచె వంటింట్లో పెట్టుకుని ఇవ్వను పొమ్మంటే ఎలా చావడం? తాలూకా ఆఫీసులో కాషియర్ గిరీ అఘోరిస్తు అంగోస్త్రం కట్టుకు ఊరేగడం అంటే ఒళ్లు చచ్చిపోయినట్లుంది. అబ్బాయికే చీటి రాసిచ్చి పంపుదామంటుంటే మనసొప్పలేదు. వాడిప్పటికే ఎంతో మధనపడి, డబ్బు వద్దులెండి నాన్నగారూ అంటున్నాడు.

కన్నకొడుకుకే కాని డబ్బివలేనివాడినా అనుకుని ఒక్కసారిగా తెగించి, వంటింట్లోకెళ్ళి, నాకు పనుంది ఆ గుడ్డలీలా పారెయ్ అన్నాడు గంభీరంగా. ఆవిడవల్లకాదు పొమ్మంది అంతకన్న గంభీరంగా - ఆ తరవాత, శంకరంగారికి చిన్నప్పటి విద్యలు జ్ఞాపకం వచ్చాయి. అక్కడే కాసేపు తారట్లాడి చూశాడు. లాభం లేకపోయింది. ఆవిడ వెయ్యి కళ్ళు పెట్టుకుని చూస్తూ ఉందాయె.

తన చిన్ననాటి కళావైదగ్ధ్యం ఈనాడు ఎందుకూ కొరగాకుండా పోయిందని విచారించాడు శంకరంగారు ఏడెనిమిదేళ్ళ కొడుకున్నా, కొంత తరిఫీదు ఇచ్చి, ఇలాటి సమస్యలను చులాగ్గా ఎదుర్కోవచ్చు. ఉన్నవాడు పాతికేళ్లవాడాయె వాడికి ఇప్పుడు టోకరా విద్య ఎలా నేర్పడం!

కాసేపు ఆలోచించి కొత్తరకం ఎత్తు వేశాడు ఆయన. వీధరుగుమీద కూర్చుని కోడలు పిల్లని పిల్చాడు. "అమ్మాయి - వంటింట చిలక్కొయ్యని నా చొక్కా పంచా ఉన్నాయిగాని, కొంచెం పట్రా అమ్మా." అన్నాడు.

కోడలు మళ్లా రాలేదు. ఆవిడే వచ్చింది. "మీ కొడుకు చెప్పింది. ఏమిటా కుళ్ళు చేష్టలు?" అని హూకరేసి వెళ్ళిపోయింది కోడలు విస్తుపోయింది.

భోజనాలయ్యాయి. పదకొండయింది. పన్నెండయింది. ఒంటిగంట కూడా అయినా, ఆవిడగారు కునుకు తీసేటట్లు కన బడలేదు. మళ్ళా నిప్పంటించి, పిండివంటలు ప్రారంభించింది కొడుకూ కోడలూ సాయంత్రం వెళ్ళిపోతున్నారుగదా అని.

శంకరంగారికి నిద్ర రాలేదు. కాలుగాలిన పిల్లిలా తిరుగుతున్నాడు. కొడుకు నిద్రపోతున్నాడు

ఆయనకో ఊహ తోచింది. వాడి చొక్కా. వేసుకుంటే? పంచె లేదాయె పొడుగు పంట్లాంలే ఉన్నాయి

శంకరంగారికి సిగ్గేసింది అయినా సరే అని ఓ పంట్లాం, తొడుక్కున్నాడు. చొక్కాలన్నీ చిత్రంగా ఉన్నాయి పట్నం చొక్కాలు కాబోలు ఒకటీ బొత్తు దిగదు - రవికెల్లా ఉన్నాయి

అద్దంలో చూచుకున్నాడు. నవ్వొచ్చింది తను నవ్వేలోగానే, ఇంకో రెండు గొంతులు, ఒకటి కిలకిల, ఇంకొకటి ఫెళ ఫెళ నవ్వాయి. ఆ నవ్వుకి లేచిన కొడుకు కూడా పకపక నవ్వాడు.

శంకరం గారికి ఒళ్లు చచ్చిపోయినట్లయింది. దొంగతనం చేస్తూ పట్టుబడ్డట్టనిపించింది. బీరువాకింద చూశాడు; దూరిపోదామని. కోడిగుడ్డు దీపం ఉండే గూట్లోకి చూశాడు; అందులో ముడుచుకు కూర్చుందామని ...ఒక క్షణం ఆగి, ముగ్గురివంకా చూశాడు. ఒక్క పెట్టున తనూ నవ్వయడం ప్రారంభించాడు.

నవ్వులయిపోయాక, తన పంచె చొక్కా యియ్యమని అడిగాడు భార్యని

మీకేం మతి పోయిందా అందామె.

మళ్లా అంగవస్త్రం తువ్వాలు కట్టుకుని, అరుగుమీద కుర్చీలో చేరాడు శంకరంగారు—సృష్ట్యాదినుండి ఏ పురుషుడూ దేనికీ పడనంతగా విరహతాపం పడుతూ

మూడున్నర అయింది రైలుకింక గంటన్నర టైముంది. ఎలా డబ్బు పుట్టించడం?

వీధివెంట ఓ కుర్రాడు వస్తున్నాడు అట్టపెట్టిని తన్నుకుంటూ. వాడు తెలుసు. శంకరం గారికి పెద్ద ఊహ పోయింది కుర్రాణ్ణి పిలిచాడు. తెగించాడు. "ఒరేయ్ బాబు నువ్వు, సుబ్బారావు గారింటికెళ్లి అర్జంటుగా...అహ కాదు. మా ఆఫీసు జవాను నాగన్నింటికెళ్ళి ఇక్కడున్నట్లుగా చిటికెలో కేకేసుకురా నీకు రేపు గాలిపడగ కొనిస్తా" అన్నాడు.

ఏకళనున్నాడో వాడు సరేనని వెళ్లాడు. మూడున్నరనుండి నాలుగుదాకా శంకరంగారి గుండెకాయ నిముషానికి మూడు వందలసార్లు కొట్టుకుంది.

నాలుగింటికి నాగన్న వచ్చి ఏం బాబూ అనగానే స్థిమిత పడింది.

"ఏవోయ్ నాగన్న నీకు పుణ్యం వస్తుంది. రేపు రూపాయొస్తుంది. కాని, వెంటనే సుబ్బారావుగారింటికెళ్లి అర్జంటుగా అత్యంతంగా ఒక్క యాభై రూపాయలు అడిగి తెచ్చి

> తండ్రి: "ఒరేయ్ రాముం! మొన్న నువ్వు ఉద్యోగానికి దరఖాస్తు పెట్టావే, ఆ కంపెనీ వాళ్ళు, నెలకి 70 రూపాయలిస్తాము, ఉద్యోగంలో చేరమని ఇప్పుడే రాశారు. ఏం, ఎంత మద్రాసైతే మాత్రం నెలకి 70 రూపాయలతో ఉండలేవ్రూ?"
>
> కొడుకు: "అవును, సరిగ్గా ఒక్క నెల ఉండవచ్చునుకుంటూను."

పెట్టు రేపు ఆఫీసుకి రాగానే ఇస్తానని చెప్పు" అన్నాడు.

నాగన్న కళ్లు పెద్దవిచేసి, అంత డబ్బు నాకిత్తారా బాబయ్యా తవరే ఒక్కడు గెల్లరాదూ?" అన్నాడు.

"వెళ్దును కాని పంచె చొక్కా...దానికేంలే. నే చెప్పానని చెబుదూ ఇస్తాడు."

"పోనీ చీటీ ముక్క రాసెయ్యండి బాబూ"

"చీటీ చీటీ కదూ. మరే చీటీ.. అవును చీటీ...కాని వీల్లేదే మా ఇంటో.. నా కర్రెంటు పనుంది. నువ్వెళ్లి చెప్పు కావాలంటే ఆయన్నే పట్టమ్మను" అన్నాడు శంకరంగారు కంగారుగా. లోపలికి తొంగి చూశారు. భార్య దగ్గర్లో లేదు.

పుణ్యం ఉంటుందనీ, జన్మలో మేలు మర్చిపోడనీ, డబ్బు మర్నాడే ఫిరాయించేస్తాడనీ, సంగతి తాపీగా చెప్తాడనీ పుణ్యం ఉంటుందనీ, జన్మలో మేలుమర్చిపోలేడనీ పదేపదే మరీ మరీ సుబ్బారావుకు చెప్పి ఎలాగైనా సొమ్ము జతపరచి పట్రావలసిందని నాగన్నకి చెప్పి పంపాడు.

నాగన్న వెళ్లిన క్షణంనుండి నాలుగూ నలభైఐదు వరకూ ఆయన గుండె నిముషానికి నాలుగువందలసార్లు చొ॥న కొట్టుకుంది.

ఇంట్లో పిండివంటలు పూర్తి అయిపోయాయి. మూటకట్టేసి, కొడుకూ కోడలూ ప్రయాణానికి సిద్ధమైపోయారు. భార్య పట్టుచీర కట్టేసుకుంది. కొడుకు బండి తీసుకురావడాని కెళ్ళాడు. ఇంకో పదినిముషాలలో అంతా రైలుకి బయల్దేరతారు.

నాగన్న సుబ్బారావు ఇంటికి వెళ్లాడా? వెళ్తే ఆయన ఉంటాడా? ఉంటే డబ్బి

## ★ ఆ చేతి చేత ★

స్తాడా? ఇచ్చినా, అది తనకి తోచేక అందుతుందా? అందినా భార్య కంటపడకుండా ఉంటుందా? కొడుకుకి కష్టం అనుకుని శంకరంగారు ఆదర్శపితగా నిరూపించుకుంటాడా?

గుమ్మంలోకి బండి వచ్చేసింది. సామానెత్తేస్తున్నారు. టైము చూసుకుని, శంకరంగారి భార్య ఆయన పంచె చొక్కా కండువా ఇచ్చేసి కట్టుకోమంది శంకరంగారు కదల్లేదు. తను లోపలికి వెళ్తే ఈలోగా కొంప మునుగుతుందని భయం. భార్య గడమాయిస్తోంది.

"మెడ పెరిగింది అర్జెంటుగా కొసిని నీళ్ళు కాచు కాపడం పెట్టాలి" అన్నాడాయన హఠాత్తుగా బాధపడుతూ.

ఆవిడకి జాలేసింది. 'పొద్దుట్నుంచి ఒక్కరూ ఆ పడక కుర్చీలోనే కూర్చున్నారాయె. పెణకదూ మరి.' అంటూ లోపలికి వెళ్ళి కుంపటి రాజేసింది.

ఈలోగా నాగన్న సుబ్బారావింటికి వెళ్ళాడు. సందేశం అందచేశాడు. కాషియర్ గారికి అప్పిచ్చినా పువ్వుల్లో పెట్టి మళ్ళా ఇవ్వగలరన్న ధీమాతో సుబ్బారావుగారు ఏభైరూపాయలూ నాగన్న కిచ్చిపంపారు. నాగన్న వాయు వేగ మనో వేగాలతో వచ్చి, శంకరంగారికి రొఖ్ఖం అందచ్చాడు "నాకిత్తానన్న రూపాయేది బాబూ!" అన్నాడు.

"రేపు రేపు రేపు. లేదు లేదు చిల్లరేదు. రేపు రెండు. రేపు రెండిస్తా- పద పద పద" అంటూ శంకరంగారు ఆదరా బాదరా ఆ డబ్బూ పంచె చొక్కా పట్టుకుని పడమటింట్లో కెళ్ళిపోయి తలుపేసుకున్నాడు.

* * *

రైలొచ్చింది పలుగురూ ఎక్కి కూర్చున్నారు - అక్కడ కూడా శంకరంగారికి స్వేచ్ఛ లేకపోయింది - భార్య ఒకపక్క కోడలికి సీతులు నూరిపోస్తూనే తనని ఓ కంట కనిపెడుతోంది.

"అత్తయ్యా, మా అమ్మ లేనికొరత తీర్చారు మీరు. ఈ ఒక్క రోజులోనూ మా పిన్ని ఇంత ఆప్యాయంగా నన్నెన్నడూ చూడలేదత్తయ్యా మీరు మా వూరు రావాలి. నెల్లాళ్ళపాటు ఉండాలి" అంది కోడలు హఠాత్తుగా.

శంకరంగారి భార్య ఉక్కిరిబిక్కిరై పోయింది. కోడలి శిరస్సు ఆఘ్రాణించింది మెటికలు విరుచుకు "నా తల్లే." అంది ఉప్పొంగే ప్రేమతో. ఒక్క క్షణం ఆగి, "ఏమండీ కోడలుకి పువ్వులు కొనిద్దామనేనా లేదుగదా. వేళైనట్టుంది చటుక్కున్న వెళ్ళి కొస్తదవనం మరువం నాలుగు చేమంతిపువ్వులూ పట్రండి" అంటూ ఓ పావలా తీసి ఇచ్చింది

శంకరంగారు ఎగిరి గంతేశాడు.

"నువ్వుకూడా వెళ్ళరా-ఆయన బేరంచేస్తే వాడిన పువ్వులే వచ్చేది" అందావిడ.

"దారా నాన్నా" అన్నాడు శంకరం విడుదల అయిన ఖైదీలా.

పువ్వులు కొన్నాక, అంగీజేబులోనుంచి ఏభై రూపాయలూ తీసి కొడుకు జేబులో పెట్టాడు. "భద్రం నాయనా. కోడలికి చెప్పకు అవసరానికుంచుకో ఇంతకన్న ఏం చేయలేక పోయాను తాపీగా పంపుతానులే" అనేసి కొడుకు జవాబు వినకుండానే రెక్క పట్టుకుని రైలు పెట్టె దగ్గరికి ఈడ్చుకొచ్చేశాడు.

రైలు కదిలింది.

రతీ మన్మథులు చెన్నపట్నానికి, పార్వతీ పరమేశ్వరులు స్వగృహానికి బయల్దేరారు

ఒంటెద్దు బండిలో జేరగిలబడి కూర్చుని, "అబ్బాయి మొహం అణాయిద్దైనంతయింది. బయల్దేరినపుడు పదకనించి డబ్బు పంపుతానన్నారు కొబోలు. అవేం వల్లకాదు." అందావిడ హేళనగా

శంకరంగారు ధీమాగా నవ్వాడు. "కోడలు పిల్ల మొహం కలకలలాడుతూ, కనబడింది. ఏమిటి సంగతి తెగించి ఓ పావలా చేతులో పెట్టి గుప్పిటమూసి, జంతికలు కొనుక్కోమన్నావా?" అన్నాడు.

"పిల్లలు అవస్థ పడతారని నాకూ తెలుసు. అక్కడికి మీకే ప్రేమ ఉన్నట్టు నిన్నా ఇవాళా నా ప్రాణం తీశారు కాని. పావలా ఏం కర్మం. నిన్న మీరడిగిన యాభై రూపాయలూ, మిమ్మల్ని పువ్వులకి పంపినప్పుడు పిల్ల చేతిలో పెట్టి, గుట్టుగా దాచుకోమని చెప్పాను. అబ్బాయికి ఈ సంగతి రాయబోకండి. తనే తగతేస్తాడు" అందావిడ విలాసంగా.

"అబ్బే. నేను రాసినా వాడలా అనగడులే." అన్నాడు శంకరంగారు గుంభనగా.

"రవణ"

## మొట్టమొదటి విమాన యుద్ధం

మొట్టమొదటి విమాన యుద్ధం 1808 లో పారిస్‌లో జరిగింది.

ఇద్దరు వ్యక్తులు విరోధులయ్యారు. తుపాకులతో ద్వంద్వ యుద్ధం చేసి అటో ఇటో తేల్చుకోవాలనుకున్నారు. ఇద్దరూ చెరొక బెలూనూ అద్దెకు తీసుకుని ఎక్కి, రెంటినీ ఒకేసారి పైకి వదిలిపెట్టారు. బెలూను గాలిలో అటూ ఇటూ ఊగుతూ ఉంటుంది కదూ. అందు చేత మనిషిని గురిచూసి పేల్చడం సాధ్యం కాలేదు. అందుకని బెలూన్ తాలూకు గాస్ నింపిన పెద్ద సంచిని మాత్రమే గురి చూసి కొట్ట సాగారిద్దరూ. మొదట్లో ఎవరికీ గురి కుదరలేదు. చివరికి ఒకడు రెండోవాడి బెలూన్ సంచీ బద్దలు కొట్టేశాడు. గాస్ బయటికి పోగానే బెలూన్ ధామ్మని కిందపడి అందులో మనిషి చచ్చిపోయాడు. గెలిచినవాడి బెలూన్ కొన్ని మైళ్ళ అవతల నెమ్మదిగా నేలకు దిగింది. అందులోంచి మొదటి వైమానిక విజేత సగర్వంగా దిగాడు.

# మరో ప్రపంచం

"కథల్లో చెప్పే రెక్కల జోడు దొరికితే బావుణ్ణు, నాలుగుదేశాలూ తిరిగి అన్నివింతలూ చూచి వద్దును కదా" అని అనుకొంటూ సిద్ధార్థుడు ఇంట్లోంచి బయటకు అడుగు పెట్టేసరికి, వాకిట్లో ఒక పాదరక్షల జత కంటబడ్డది. వాటికి రెక్కలు కూడా ఉన్నాయి. తనకోరిక విని దేవతలు ఆజోడు పంపించి ఉంటారని సిద్ధార్థుడు సంతోషించేడు. తొందరగా ఆజోళ్ల దగ్గరకు వెళ్లి, వాటిని తనకాళ్లకు తొడుగుకొన్నాడు. ఆతరువాత 'జైపరమేశ్వరా' అనేసరికి, నేలమీదనుండి లేచి గాలిలో ఎగిరిపోతున్నాడు. వింత ఏమిటంటే సిద్ధార్థుడలా ఎగిరిపోవడం ఎవరూ చూడలేదు.

అతడలా ఎగిరిఎగిరి ఒక దట్టమైన అడవి మీదనుండి పోతున్నాడు. ఏపట్టణానికి వెళ్లడమో అతడింకా నిశ్చయించుకోలేదు. అకస్మాత్తుగా సిద్ధార్థుడి ఎడమ అరికాలిలో దురద పుట్టింది. గాలిలో ఎగురుతూనే సిద్ధార్థుడు వంగి, ఎడమకాలు జోడుతీసి, అరికాలు గోకుకొనే సమయంలో చెయిజారి ఆజోడు క్రింద పడి ముక్కలయింది! ఒక కాలిజోడుతో ఎంత ప్రయత్నించినా ఇకముందుకు సాగలేకపోయాడు సిద్ధార్థుడు!

మెల్లగా నేలమీద దిగేడు. ఒకజోడు నాశనమయింది. రెండవ జోడుతో ప్రయాణం సాగదు. "అద్దిరా! దైవమహిమ! ఎంతలోనే ఎంతకు వచ్చింది. ఇంటి దగ్గర హాయిగా కూర్చోలేక ఈమాయ జోడు తొడుగుకొని బయలుదేరాను. ఏదేశాలూ చూడకుండానే ఈ అడవిలో చిక్కుకొన్నాను. ఏమిటి దారి?" అని సిద్ధార్థుడు ఊరికే ఆలోచిస్తున్నాడు.

చీకటి పడుతోంది. సిద్ధార్థుడి చుట్టూ పొదలూ కీచురాళ్ల రొదలూ పుట్టలూ,— గులకరాళ్లగుట్టలూ — ఎక్కడో పులుగుల అరుపులూ. సిద్ధార్థుడికి భయం వేసింది. ఎటుచూసినా దారీ తెన్నూ కనబడటంలేదు. ఏమిటి చెయ్యడమా అని కొట్టుకొంటూన్న గుండెలతో, సిద్ధార్థుడు భగవంతుణ్ని ప్రార్థించడం ప్రారంభించేడు.

## కొడవంటి నరసింహం

ఉన్నట్టుండి, ఎండుటాకులమీద ఎవళ్లో నడుస్తూన్న శబ్దమైంది. సిద్ధార్థుడు తలఎత్తి చూసేడు. ఎదురుగా పొదలు కదులుతున్నాయి. ఎక్కడనుండో 'బ్యాటరీలైట్లు' వెలుగుతూన్నట్లు కాంతి కనిపిస్తోంది. సిద్ధార్థుడు ఆశ్చర్యంతో చూస్తున్నాడు. పొదలన్నీ చీల్చుకొని, నలుగురు విచిత్రవ్యక్తులు ముందుకు వచ్చేరు. వాళ్లు మానవులో, రాక్షసులో తెలియదు. ఒంటినిండా లోహకవచం ధరించిఉన్నారు. వాళ్ల నుదుటిమీద మూడవకన్నులా, ఒక 'బల్బు' వెలుగుతోంది. ఆ వెలుగే 'బ్యాటరీ' వెలుగులా, నేలమీద పడుతోంది. వాళ్ల లోహకిరీటాల మీద నిటారుగా, సుమారు ఒకటిన్నర అడుగుల పొడవుగల ఇనప ఊచలున్నాయి. వాళ్లు మెల్లగా అడుగులు వేసుకొంటూ సిద్ధార్థుణ్ని సమీపించారు. అతడు భయంతో కెవ్వుమన్నాడు. స్పృహ తప్పిపోయింది...

మళ్ళీ, తెలివి వచ్చేసరికి, సిద్ధార్థుడొక పెద్ద యంత్రాగారంలో ఉన్నట్టు తెలుసుకొన్నాడు. ఆ నలుగురు లోహ మానవులూ, కనబడలేదు. చుట్టూ చూసేడు. అంతా విచిత్రంగా ఉంది. తను ఎప్పుడూ చూడని యంత్రాలు - లోహధేనువులూ, లోహాశ్వాలూ-అంతా అయోమయంగా ఉంది! సిద్ధార్థుడలా వెఱ్ఱివాడిలా ఏమీ తోచక నాల్గు దిక్కులూ చూస్తూఉంటే, ఒక ప్రక్కనుండి గంభీరమైన కంఠస్వరం ఒకటి అతడిని పలుకరించింది. సిద్ధార్థుడు ఆవంక తిరిగి చూచేడు. ఒక ఎత్తైనచోట, పట్టుపరుపులకుర్చీలో, మానవస్వరూపంతో ఒకవిచిత్రవ్యక్తి కూర్చొని ఉన్నాడు. మీసం, గడ్డం దట్టంగా బలిసి అతడిపెదవుల్ని పూర్తిగా కప్పివేసేయి అతడు నిశ్చలంగా కూర్చొని ఉన్నాడు. ఏమీ చైతన్యంలేదు. అతడి ముందు కొన్ని 'డజన్ల' మీటలు చేతికందుబాటులో ఉన్నాయి.

సిద్ధార్థుడు నోటమాటలేకుండా ఆ వ్యక్తిని చూస్తూఉన్నాడు. ఆ వ్యక్తిలోనుండి శబ్దాలు బైటకురావడం మొదలుపెట్టేయి. ఆ శబ్దాలు సిద్ధార్థుడి చెవుల కీవిధంగా వినిపించేయి—

శబ్దం: నేనెవరో నీకు తెలుసా?

సిద్ధార్థుడు: నాకు తెయదు.

శబ్దం: నేను ఈ నవీన ప్రపంచానికి సృష్టికర్తనీ, పాలకుణ్ణీ. నాచేతిదగ్గరఉన్న మీటలు-కావలసినవి నొక్కుతూ, కదలకుండానే, ఈ యంత్రాగారంఅంతా, చిత్తం వచ్చినట్లు నడపగలను. ఇక్కడ ఎన్నో విచిత్రాలున్నాయి. చూడాలనిఉందా?

సిద్ధార్థుడు: విచిత్రాలుచూడాలనే ఇంటి నుండి బయలుదేరేను. దారిలో, అడవిలో పడి దిక్కులేకఉంటే ఎవరో లోహమానవులు నామీదకు వచ్చేరు

శబ్దం: వాళ్లు నా సేవకులు. వాళ్లు

ఒకచోట ఉక్కుకోడి గుడ్లు పెడుతోంది. మరొకచోట మరల సాలీడు పట్టుదారాలతో బట్టలు నేస్తోంది. ఇంకోచోట మీట నొక్కగానే రంగురంగుల బట్టలు కట్టుకొని కొందరు ఆడపిల్లలు గాలిలోనే నాట్యంచేసి మాయమయ్యారు. ఇంకా ఎన్నో వింతలు, విచిత్రాలు.....

# మరో ప్రపంచం

చీకట్లో కూడా చూడడానికి, వాళ్ళనుదుట్లో 'బల్బు' పెట్టి, వాళ్ళబుర్రలో పెట్టిన 'బ్యాటరీ'వల్ల వెలిగేలా చేసేను. అంతే కాదు. వాళ్ళెంత దూరంలో ఉన్నా నా ఆజ్ఞలు వాళ్ళకు వినిపించడానికి వాళ్ళ తలలమీద ఇనప ఊచలు తగిలించేను. ఇక్కడ నేను శబ్దగ్రాహక యంత్రంలో మాట్లాడితే చాలు, నా మాటలు గాలిలో తేలుతూపోయి, వాళ్ళతలలమీది ఇనపఊచల గుండా వాళ్ళ మెదడులలోకి ప్రవేశిస్తాయి. వాళ్ళే నిన్నిక్కడికి తీసుకొనివచ్చేరు. ఇక్కడి వింతలన్నీ చూడాలనిఉంటే చెప్పు. ఒక మనిషిని తోడిచ్చిపంపుతాను.

సిద్ధార్థుడు : మీరెవరో చాలా గొప్పవారు! ఇక్కడి వింతలన్నీ చూడాలనే ఉందికాని పొద్దుటినుండీ ఏమీతినలేదు. ఆకలివేస్తోంది.

శబ్దం:- ఫరవాలేదు. నేను పంపే మనిషే నీకు ఆహారంకూడా ఇస్తాడు.

అలా అని విచిత్రవ్యక్తి ఒక మీట నొక్కేడు. ఎక్కడనుంచో ఒక లోహమానవుడు వచ్చేడు. అతడికి ఏవేవో మాటలు చెప్పేడు. అప్పుడా లోహమానవుడు సిద్ధార్థుడి దగ్గరకు వచ్చి తనతో రమ్మని సంజ్ఞ చేసేడు. 'వెళ్లు' అని పైనుండి శబ్దం వినిపించింది. మారుమాటాడకుండా సిద్ధార్థుడు లోహమానవుణ్ణి వెంబడించేడు.

ఇద్దరూ ముందు ఒక ఖాళీ గదిలోకి వెళ్ళేరు. అక్కడ గోడమీద కొన్ని మీటలున్నాయి. లోహమానవుడు వాట్లో ఒక మీటని నొక్కేడు. పైనుండి ఒక బల్ల దిగి నేలమీదికి వాలింది. అలాగే ఒక కుర్చీకూడా పైనుండి దిగి బల్లప్రక్క చేరింది. ఆ కుర్చీమీద కూర్చోమని లోహమానవుడు సిద్ధార్థుడికి సంజ్ఞ చేసేడు. సిద్ధార్థుడు కూర్చున్నాడు. లోహమానవుడు ఇంకో మీట నొక్కేడు. బల్లమీదికి ప్లేట్లతో తినుబండారాలు ప్రత్యక్షమయ్యేయి. వాటిని తినడానికి చెయ్యి ఎత్తబోతే సిద్ధార్థుణ్ణి వారించి, లోహమానవుడు ఇంకో మీట నొక్కేడు. ఒక్కొక్క తినుబండారమే ఎగిరి సిద్ధార్థుడి నోటిలో పడడం మొదలుపెట్టింది. దాహం వేసినప్పుడు, అడగకుండానే నీటిగ్లాసు నోటిదగ్గరకు వచ్చి వాలి నోట్లో నీరుపోసింది. సిద్ధార్థుడి ఆకలితీరింది! లోహమానవుడొక మీటనొక్కగానే అన్ని వస్తువులూ మాయమయ్యేయి. అప్పుడు వాళ్ళిద్దరూ తిరిగి యంత్రాగారంలోకి ప్రవేశించారు.

అక్కడ ఒక లోహధేనువువద్ద సిద్ధార్థుణ్ణి ఆపేడు లోహమానవుడు. అక్కడ ఒక మీట నొక్కగానే 'ఆ ఉక్కు ఆవు మూతి దగ్గరకు నాలుగు బాల్చీలు వచ్చుకొంటు వచ్చేయి. వాట్లోకి తొంగిచూసేడు సిద్ధార్థుడు. ఒక దాంట్లో సున్నంనీళ్లూ-ఒకదాంట్లో మైదాపిండీ-మరొక దాంట్లో పంచదారా-నాలుగో దాంట్లో మంచినీళ్లూ కనిపించేయి. అంతలో, లోహమానవుడు, ఆవుకడుపు వద్ద ఒక చిన్న మరతిప్పగానే, కడుపులోనే ఒక తలుపు తెరుచుకొంది. సిద్ధార్థుణ్ణి లోపలికి చూడమని సంజ్ఞచేసేడు. లోపల ఒక పెద్ద గంగాళం ఉంది. అందులోకి, ఆవు మూతి వద్దనుండి నాలుగుగొట్టాలు వచ్చి వంగి ఉన్నాయి. గంగాళంమధ్య ఒక ఇనుప కవ్వం తిరుగుతోంది. లోహమానవుడు ఆవు ఎడమచెవి నులిపేడు. బాల్చీలలోని పదార్థాలు ఆవు తాగడం మొదలుపెట్టింది. ఒక్కటొక్కటిగా, సున్నం నీళ్లూ, పంచదార, మైదాపిండీ, మంచినీళ్లూ అన్నీ ఆవుకడుపులో గంగాళంలో పడుతున్నాయి కవ్వం గిర్రున తిరుగుతోంది. అలా కొంతసేపయాక ఆవుపొదుగులు నాలుగింటినుండీ ఒక్కసారిగా క్రింద కళాయిలోకి పాలుపడడం ఆరంభించింది! సిద్ధార్థుడు విస్తుపోయి చూస్తున్నాడు. ఆ పాలని రుచిచూడమని లోహమానవుడు సంజ్ఞచేసేడు. సిద్ధార్థుడు రుచిచూసేడు. అచ్చంగా ఆవుపాలు!

అక్కడనుంచి ఇద్దరూ కలిసివెళ్ళేరు. ఒకచోట నాలుగైదు నాగుపాములు బుస్సలు కొడ్తూ, గాజు పాత్రలలోకి విషం కక్కుతున్నాయి. ఒక గ్లాసుతీసి తాగమని లోహమానవుడు సంజ్ఞచేసేడు. భయంతో సిద్ధార్థుడు అక్కడనుండి ముందుకు పారిపోబోయాడు కాని లోహమానవుడు పట్టుకొని ఆపేడు. తరువాత అతడొక మీట నొక్కగానే పాములు విషం కక్కడంమాని పడుకొన్నాయి. ఒకవిషం గ్లాసు ఎగిరి సిద్ధార్థుడి నోటిలో ఒలికింది. అది విషంకాదు అమృతం! తియ్యగా ఉంది. అదేదో వర్బత్తనుకొన్నాడు సిద్ధార్థుడు.

అక్కడనుండి మళ్లీ కదిలేరు. ఒకచోట ఉక్కు కోడిగుడ్లు పెడుతోంది! మరొక చోట మరల సాలీడు పట్టుదారాలతో బట్టలు నేస్తోంది! ఇంకోచోట లోహమానవుడు మీటనొక్కగానే రంగురంగుల బట్టలు కట్టుకొని కొందరు ఆడపిల్లలు గాలిలోనే నాట్యంచేసి మాయమయ్యేరు! ఇంకా, ఇంకా ఎన్నో వింతలు- విచిత్రాలు- వివిధ యంత్రాలు- బర్రున శబ్దంచేస్తూ గిర్రున తిరిగే లోహ చక్రాలు- అన్నీ చూచి సిద్ధార్థుడి ఒళ్లు తిరిగింది. కళ్లు మూతలు పడ్డాయి.

మళ్లీ కళ్లు తెరిచేసరికి, లోహమానవుడు లేడు. ఎదురుగా ఎత్తైన స్థలంలో ఆమాయ ప్రపంచపు సృష్టికర్త ఉన్నాడు. సిద్ధార్థుడి చెవిలో మళ్లీ శబ్దం మ్రోగింది.

శబ్దం: అన్నివింతలూ చూచేవా! చూసె నేనెంత గొప్పవాణ్ణో! ఏ పని అయినా ఇక్కడనుంచే కదలకుండా చేయించుకో గలను. నేనే దేవుణ్ణి.

సిద్ధార్థుడికి ఈ "అయోమయ" ప్రపంచం రుచించలేదు. మామూలు మనుష్యులు కనిపించడంలేదు. ప్రకృతి అందంలేదు. అన్నీ మీటలు- యంత్రాలు ఒక సందేహం అతడి మనస్సులో మెరసింది. అతడిలా అడిగేడు. "ఓ మహాశక్తి! ఇవన్నీ నీవొక్కడవే సృష్టించేవా?"

శబ్దం : నీకు తెలుసుకోవాలని ఉంటే చెబుతాను. విను. ఈ యంత్రాలు నిర్మించడానికి ఎందరో మానవులు పనిచేసేరు. పని పూర్తికాగానే అందర్నీ పాతాళగృహంలోకి తోసివేసేను.

సిద్ధార్థుడు : అందర్నీ ఒక్కడవే!

శబ్దం : అవును. నా దగ్గర ఒక యంత్రం ఉంది. మీట నొక్కగానే అందులోనుండి కనబడని కాంతి కిరణాలు బయటకు వచ్చి మనుష్యులశక్తి పీల్చి నశింపచేస్తాయి ఆ విధంగానే నాకోసం పనిచేసినవాళ్ళందర్నీ శక్తిహీనుల్ని చేసి పాతాళానికి కూలదోసేను.

సిద్ధార్థుడికి ఆవిచిత్రవ్యక్తి అంటే ఒక్కసారిగా అసహ్యం పుట్టుకొచ్చింది. మనుష్యులచేత అవసరం అయినంతవరకు పని చేయించుకొని తరువాత అగాధాలలో కూలదోసిన అతడి క్రూరత్వానికి సిద్ధార్థుడి ఒడలు మండిపోయినవి. కోపంతో "తోడి మానవులని పీల్చి పిప్పిచేసి, యంత్రాలతో కులుకుతున్నావు! సృష్టికర్తననీ, దేవుణ్ణనీ విర్రవీగుతున్నావు! నీ దుర్మార్గానికి ప్రతీకారం జరక్కపోదులే"అని సిద్ధార్థుడు గట్టిగా అరిచేడు.

శబ్దం : నన్నే దూషిస్తావుగా! చూడు, నిన్నేం చేస్తానో. ఈ మీట నొక్కితే చాలు నువ్వు మాడి భస్మం అయిపోతావు.'

సిద్ధార్థుడు: 'భగవంతుడు నన్ను రక్షిస్తాడు. నీఇష్టం వచ్చినట్లు చేసుకో.'

విచిత్రవ్యక్తి మీట నొక్కేడు--కాని-- ఏమీ కాలేదు. దైవికంగా ఎక్కడో ఒక విద్యుత్తంతువు తెగింది. దాంతో అన్ని యంత్రాలు ఆగిపోయేయి ఆవ్యక్తిశక్తి సన్నగిల్లింది. యంత్రాలను శాసించే ఆ వ్యక్తి విద్యుచ్ఛక్తి సమ్మెకట్టగానే, నిస్సహాయుడైనాడు.

"జై పరమేశ్వరా" అంటూ సిద్ధార్థుడు బయటకు వచ్చేశాడు. ఆకాశంలో నల్లమేఘాలు కూడి, ఢీకొని పిడుగుల వర్షం కురిపించేయి.

మరో ప్రపంచం మాడి భస్మం అయింది.

ఆ చప్పుడుకు, సిద్ధార్థుడికి మెలకువ వచ్చి, కళ్లు నులుముకొంటూ పక్కమీద నుండి లేచేడు.

# లేడీస్ క్లబ్

(గతవారం తరువాయి)

మరి రెండు రోజులకు దుర్గ తను పట్టుకు వెళ్ళిన ఎంబ్రాయిడరీ, నిట్టింగ్ పుస్తకాలతో లోపలికి వచ్చింది.

"పేరెంట్స్ మేగజైన్" లో ఒక డిజైను ప్రకారం కల్పనకు "స్లీప్ సూట్" కుట్టడంలో తీవ్రంగా నిమగ్నమై వున్న మనోరమ కుట్టుమిషన్‌ను అవతలకు నెట్టి దుర్గను చిరునవ్వుతో ఆహ్వానించింది.

"చాలా పనిమీద వున్నట్టున్నారు!" అంది దుర్గ వచ్చి పక్కన కూచుంటూ.

"అబ్బే! ఉబుసుపోకకి చేస్తున్న పని, అంతే! ఏదో గౌను కుడదామని మొదలు పెట్టాను..." అని చులకనగా నవ్వేసి; "అప్పుడే పుస్తకాలు అట్టుకొచ్చేశారేమిటి" అంటూ తిరిగ్గా కబుర్లకు దిగడానికి సిద్ధమైనట్లు కూర్చొంది మనోరమ.

"ఏం చెయ్యమంటారండీ? కుట్టేవత్తు కనిపడనప్పుడు! క్షణంకూడా తీరిక లేకుండా పొద్దస్తమానం పనితోనే సరిపోతోంది. కుట్టేదీ వేట్టేదీ లేనప్పుడు వీటిని నా దగ్గర పెట్టేసి వుంచటమెందుకు, మీకైనా ఉపయోగ పడకుండాను అనిపించింది. అందుకని తెచ్చేశాను." నవ్వేసింది దుర్గ.

ఆ నవ్వు మాటున ఎంతో వెలితి దాగి వున్నట్లనిపించింది మనోరమకు. ఆ వెలితిని లెక్కకడుతూ ఒక్క క్షణం పాటు అలాగే వుండిపోయింది మనోరమ.

ఆ తరువాత, దుర్గ తన ఇబ్బందులనేమీ చెప్పకపోయినా దుర్గ పరిస్థితి ... దుర్గ తన ఇబ్బందులనేమీ చెప్పుకోకపోవడం మనోరమకు ఆశ్చర్యం కలిగించింది. ఆమె ఎంత నిండుకుండలాంటి మనిషో! అనుకుంది. తను పట్టుకు వెళ్లిన పుస్తకాల్లో డిజైనులు కుట్టకపోవడం మాట అటుంచి, అందుకు తనకు ఫలానా సామానులు కావాలి తెచ్చిపెట్టమని ఆమె భర్తను అడిగివుండదైనా అడిగి వుండదని మనోరమ నిర్ధారణ చేసుకుంది.

ఇంతలో ఏదో హఠాత్తుగా జ్ఞాపకం వచ్చినట్లు "అన్నట్లు, నేనే మీకు కబురు

> దుర్గకు కుట్టుపనులు నేర్పేవిషయంలో మనోరమ చేతనైనంత శ్రద్ధ తీసుకుంది. చోళీలు, బ్లేజులు, పిల్లల ప్లేసూట్లు ఇత్యాది దుస్తుల రకాలు ఎన్ని వున్నాయో, వాటికి ఏయే ఆదులు ఎలా తీసుకోవాలో సాధ్యమైనంత త్వరలో దుర్గకు నేర్పడానికి మనోరమ శత విధాల శ్రద్ధ వహించింది.

పంపుదామనుకుంటున్నాను. ఇంతలో మీరే వచ్చారు. సరే, విషయమేమిటో చెప్తాను, వినండి- కుట్టుమిషన్ నేర్చుకోవడం అంటే మీకిష్టమేనా?" అంది మనోరమ.

"ఏది నేర్చుకోవడమన్నా ఇష్టమే. అవకాశమూ తీరుబడీ వుండాలి కాని..." అంది దుర్గ.

"అవకాశానికేం? నేను నేర్పుతాను. నాకు కొంత బాగానే వచ్చు. మిషను దగ్గిరా సామానులన్నీ సాదగ్గరున్నాయి. మధ్యాహ్నం పూటల అంతా నేను తీరుబడిగానే వుంటాను. వీలుచేసుకు రండి. మీరు నేర్చుకోవడం నిజంగా చాలా మంచిదండీ!" అనిమాత్రం అంది మనోరమ. డబ్బు సంపాదనకు వీలుంటుందని సూటిగా చెప్పడం ఇష్టంలేక.

దుర్గ "సరే" నని ఒప్పుకోనక తప్పింది కాదు.

దుర్గ ఇంటికి తిరిగి వెళ్ళిపోతూవుంటే, "మధ్యాహ్నం తప్పకుండా వస్తారు కదూ? మీకోసం చూస్తూ వుంటాను. రేపే మొదలుపెట్టేద్దాం. మిషను మీద కుట్టడం, ఆదులు తీసుకోవడం ముందువస్తే, ఆ తరువాత కత్తిరింపులు నేర్చుకోవచ్చు. వస్తారు కదూ?" అంది మనోరమ దుర్గతో గేటు దాకా వస్తూ.

మనోరమ తన పట్ల చూపుతున్న శ్రద్ధకు దుర్గ ఆశ్చర్యపోతూ "అలాగే తప్పకుండా వస్తాను" అని బయలుదేరింది.

మర్నాడు, దుర్గ అన్న ప్రకారం వచ్చింది. కబుర్లతో ఏవిధమైన కాలయాపనా చెయ్యకుండా మనోరమ కుట్టుపని మొదటి పాఠం ప్రారంభించింది అసలు కుట్టుమిషన్ ఎలా ఉంటుందో, దానిలో దారం ఎలా అమర్చాలో చెప్పింది. ఆ తరువాత, కుట్టేటప్పుడు గుడ్డను ఎలా నడపాలో, ఎలా కుట్టాలో కూడా చెప్పి అంతకు పూర్వమే సిద్ధంచేసి వుంచిన పాత గుడ్డ ఒకటి ఇచ్చి దుర్గను కుట్టమంది. ఆ తరువాత "ఫ్రీల్స్" వగైరాలు పొయ్యడం ఎలాగో, గుండీలు కుట్టడం ఎలాగో కూడా నేర్పి ఇవి చెమ్మది మీద వస్తాయనీ, మామూలుగా మిషనుమీద కుట్టడం ముందు సాధన చెయ్యమని చెప్పింది.

దుర్గ కూడా ఇవన్నీ అట్టే కష్టం లేకుండానే గ్రహించడం చూచి, ఆమెకు నేర్పడం తేలికే తెప్పని మనోరమ సంతోషించింది.

సాయంత్రం, దుర్గ యింటికి వెళ్ళబోతూ వుంటే మనోరమ పనిమనిషిని పిలిచి, తన కుట్టుమిషను తీసుకుపోయి దుర్గ యింట్లో పెట్టి రమ్మని చెప్పింది.

ఈ మాటలకు దుర్గ ఆశ్చర్యపోయి "ఎందుకండీ, రేపు నేనే వస్తానుగా" అంది.

"వద్దుదు గాని, ఈలోపల తీరుబడి అయినపుడల్లా ఇంటి దగ్గర కూడా మీరు ప్రాక్టీసు చేద్దురుగాని. చిన్న మిషనే గనక మళ్ళా రేపు మీరు వచ్చేటప్పుడు పనిమనిషి ఇక్కడికి తీసుకు వస్తుంది." అంది మనోరమ.

ఇక సమాధానం చెప్పి ప్రయోజనం లేదనుకుంది దుర్గ.

మనోరమ సాయంత్రం లేడీస్ క్లబ్బుకి వెడితే, రమణి వని కట్టుకుని అడిగింది, "ఏమండీ! మీకు బట్టలు కుట్టే అవిడ్ని అడిగారా?" అని.

మిగతా వాళ్ళు చాలా మంది కూడా సమాధానంకోసం ఆసక్తితో ఎదురు చూశారు.

"అన్నట్లు చెప్పటం మరిచాను. ఆ

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

వెంపటి
సచ్చిదానంద శర్మ

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

అడులు తీసుకోండి. కత్తిరింపులు మాత్రం నేను చూస్తాను—కొన్ని రోజులపాటు. వాళ్ళకు మీఇంటి ఎడ్రస్ చెపితే మీఆయన ఏమయినా అనుకుంటారా?" అంది మనోరమ.

"అబ్బే! ఆయనేమీ అలా అనుకోరండీ.. ఇతర్లది కానీకూడా ముట్టకూడదనేదీక్షకూడా ఏమీ లేదాయనకి! అవసరమైనప్పుడల్లా చిలర అప్పులు చేసి తీరుస్తూనేవుంటారు!...కొన్ని కొన్ని విషయాలలో మాత్రమే ఆయనకి విపరీతమైన పట్టుదలలు...చేతనయితే నన్ను సంపాదించమంటారు ఇప్పుడు చదువుకోమంటారు. ఇంకో చదువేమిటి, నా మొహం!" అంది దుర్గ పరిహాసంగా.

"అసలు ఎంతదాకా చదివారు?" అంది మనోరమ.

"ఫిఫ్త్ ఫారందాకా...ఆ తరవాత పెళ్లయింది. దానితో సరి!" అంది దుర్గ సిగ్గుపడుతూ.

ఆపాటి చదువయినా వుండడంవల్లనే చెప్పిన విషయాలు గ్రహించి, చెప్పినంతవరకు కుట్టుపని దుర్గ అంత తొందరగా నేర్చుకోగలిగింది అనుకుంది మనోరమ "నిజమే. మెట్రిక్ కి కట్టండి. కావలిస్తేచేతనయిందేదో నేనుకూడా నేర్పుతాను. ముందు కత్తిరింపులుకూడా కొత్త నేర్చుకుంటిరా అంటే, ఆ తర్వాత మీకు వెసులుబాటు చిక్కుతుంది" అంది.

తన మొట్టమొదట సంపాదన ఇంటికి తీసుకుపోతూ దుర్గ అవ్యక్తమైన ఆనందావేశాలు పొందింది.

ఆనాడు సాయంత్రం దుర్గ దగ్గరకి సుమిత్ర, ఇందిర, శాంత, శారద జాకెట్టు గుడ్డలు తీసుకొచ్చారు. ఎలా కుట్టాలో వివరాలన్నీ తీసుకుని వాళ్ళని పంపింది దుర్గ.

మర్నాడు మధ్యాహ్నం ఆ గుడ్డలు తీసుకొని, దుర్గ మనోరమ దగ్గిరికి బయలుదేరింది.

"వాళ్ళు మీదగ్గిరికి వచ్చారోలేదో అనుకుంటున్నాను. వచ్చారన్నమాట!" అంటూ దుర్గచేతిలో గుడ్డలుతీసి మనోరమ సంతృప్తిని ప్రకటించింది.

"నా దగ్గర కుట్టుపనిమీద పుస్తకాలు,




ఫాషన్ మాగజైనులు వున్నాయి. వాటిని ఇంటికి పట్టుకుపోయి తీరిగ్గా వున్నప్పుడు స్టడీ చెయ్యండి...ఇంకనుంచీ గుడ్డలుకూడా మీరే కత్తిరిద్దురుగాని. నేను మాత్రం పైనుండి జాగ్రత్తగా చూస్తూవుంటాను," అంది మనోరమ, దుర్గ తెచ్చిన గుడ్డల్ని అడుల ప్రకారం కత్తిరించి యిస్తూ.

ఈ మాటలతో దుర్గ ఉబ్బి తబ్బిబ్బయింది.

దుర్గ ఇంటికి తిరిగి వెళ్ళేటప్పుడు చాలా పుస్తకాలిచ్చి, "ఇక మీరు పెద్దకుట్టుమిషన్ ఒకటి కొనుక్కుందురుగాని...చాలా తేలికేకూడాను! మూడోవంతు డబ్బు కడితేచాలు మిషన్ మనకిస్తారు. మిగతాది వాయిదాల మీద తీర్చుకోవచ్చు. ఇందుకు నేను హామీ వుంటాను" అంది మనోరమ.

అప్పటినుంచీ గుడ్డల కత్తిరింపుల విషయంలోకూడా మనోరమ చెయ్యి చేసుకోవడం మానివేసి, ఆ పనికూడా దుర్గకే అప్పగించింది. తనుమాత్రం పైనవుండి అవసరమయితే సలహాలుమాత్రం ఇచ్చేది.

అయితే, క్లబ్బులో జనానికి మాత్రం, దుర్గదగ్గిర బట్టలు కుట్టించుకోవడం విషయంలో ఆసక్తి తగ్గకుండా మనోరమ అమితమైన జాగ్రత్తలు తీసుకునేది. దుర్గపేరు కేవలం క్లబ్బుమెంబర్లకు మాత్రమే పరిమితం కాక, బయటకూడా వ్యాపించేవరకూ ఈపాటి జాగ్రత్త అవసరమని ఆమె భావించింది.

"మనోరమగారూ! మీధర్మమా అని... మా బట్టలబాధ తీర్చారండీ! బట్టలు బాగా లేవంటూ ఇంటిదగ్గిర నానాగొడవు లేకుండా చేసినందుకు మాఆయన మీకు థాంక్స్ అని చెప్పమన్నారండీ!" అంది ఇంజనీరుగారి కోడలు కమల, ఏదో ప్రసంగవశాత్తు

క్లబ్బులో కూర్చున్నవాళ్ళంతా గలగలా నవ్వారు.

మిషన్ కొనడానికి వెళ్ళినరోజున దుర్గతోపాటు కృష్ణమూర్తి కూడా షాపుకి వచ్చాడు. అతడి మాటల్ని బట్టి సరసుడేఅనే అభిప్రాయం కలిగింది మనోరమకు.

"ఏమండీ, మీరు చెప్పండి...ఒక డిగ్రీ చేతిలో వున్నవాడు ఈ రోజుల్లో ఏపాటి కట్నం పుంజుతున్నాడు?" అన్నాడు కృష్ణమూర్తి.

అసలు ఈ ప్రశ్న ఏమిటో, ఎందుకిలా అడుగుతున్నాడో అర్థంకాక మనోరమ బిత్తరపోయింది.

ఇంతలో దుర్గ, "ఏమైనాకాని, నన్ను చంపినాసరే కట్నం డబ్బుగా మాత్రం నేనేమీ ఇవ్వను! చూశారండీ— నేను సంపాదించి తన కట్నం డబ్బు తనకివ్వాలిటండీ!" అంది.

అసలు విషయమేమిటో ఇప్పటికి అర్థమై మనోరమ విపరీతంగా నవ్వడం మొదలుపెట్టింది. కుట్టుమిషన్ కొంటున్నంతసేపూ, ఈమాట గుర్తుకువచ్చి పదేపదే తనలో తనే నవ్వుకుంది. స్యూరిటీ బాండుమీద సంతకం చేసి ఇంటికి తిరిగివస్తూ కృష్ణమూర్తితో "చూస్తూవుండండి! మరి నాలుగురోజులలో మీ ఆవిడ మీకంటె ఎక్కువ సంపాదిస్తుంది!" అంది మనోరమ.

ఇంతలో దుర్గ అందుకుని, "నన్ను అత్తమానం తను ఎద్దేవా చేస్తారండీ. ఉద్యోగం చెయ్యడం అంటే బంగాళాదుంపలు వేగించడంలాంటిది కాదని! మరి అప్పుడు చెప్పాలి కాదండీ...బంగాళాదుంపలు వేగించడం అంటే ఉద్యోగం చెయ్యడం అంత తేలికైన పనికాదని!" అంది.

ఇలాంటి పరిహాసాలకు కృష్ణమూర్తిచిన్నబుచ్చుకునే మనిషేమీ కాదు. ఇంత సంతోషం అననుకూల పరిస్థితుల కారణంగా వాళ్ళలో ఎలా మాటుమణిగివుందో గ్రహించింది మనోరమ.

ఆ తరువాత కృష్ణమూర్తి ఇంట్లో క్రమంగా మార్పులు ప్రారంభమైనాయి. ముందుగది, ఎవరయినా వస్తే కూర్చోడానికి వీలుగా ఒకవిధమైన షాపు ఆకారానికి మారింది. బట్టలు ఇచ్చిరావడం మొదలైన పనులకి ఒక కుఱ్ఱవాడు కుదిరాడు. ఇద్దరు పిల్లలు పని నేర్చుకోవడానికి కుదిరి, గుండీలు కుట్టడం, కాజాలుతియ్యడం ఇత్యాది చిల్లరపనులు

కొత్తగా ఉద్యోగంలో చేరిన అబ్బాయిని మేనేజరు పిలిచి చెప్పాడు: "అసిస్టెంటు మేనేజరు చెప్పింది విన్నావా? ఆయన చెప్పినట్లులా చేస్తూ ఉండు. ఏం?"

"అలాగేనండి. మీరు ఆయన్ని పిలిచినప్పుడల్లా, ఆయన్ని నిద్ర లేపవలసిందని చెప్పారండి. ఇందులో పెద్దకష్టమేముందండి?"

చేస్తున్నారు వాళ్ళిద్దరికీకూడా దుర్గ ఘనంగానే ముట్టచెపుతున్నది.

ఒకనాడు మధ్యాహ్నంపూట దుర్గ మనోరమ దగ్గిరికి పెత్తనానికి వచ్చినట్టు వచ్చి, ఇప్పుడు తనసంపాదన తనభర్త సంపాదనను మించిపోయిందని చెప్పింది.

"అది చాలదండీ. మీదగ్గర కుట్టుపనికి ఎవరినైనా కుదుర్చుకుని, ఆవిడకి మీ ఆయన జీతంకంటే ఎక్కువ జీతం మీరివ్వగలగాలి!" అంది మనోరమ.

ఇద్దరూ అదేపనిగా నవ్వడం మొదలు పెట్టారు.

"ఆ తరువాత మీ ఆయనచేత మా ఆయనకు రాజీనామా పుత్తరం ఇప్పించండి!" అంది మనోరమ మళ్ళీ

ఇద్దరూఇంకా విరగబడినవ్వడం మొదలు పెట్టారు.

విశేషమేమంటే, ఇలా జరగడం అంత హాస్యాస్పదమైన విషయమనే అభిప్రాయం నిజంగా వాళ్ళలో ఎవ్వరికీ లేదు.

అందుకనే—

అంత పెద్దజీతానికి తను ఒక మనిషిని పనిలో పెట్టుకోబోతున్నానని ఒకనాడు దుర్గఅంటే అందుకు కృష్ణమూర్తి ఏమీ చలించలేదు. పైగా, "మన శక్తికొద్దీ మనం ఇవ్వాలిగాని, నా జీతంకంటె ఎక్కువై పోతుందేమోనని చెప్పి పాపం ఆవిడకి లేకుండా చెయ్యడం ఏమిటి?" అన్నాడు

ఇస్తామన్న కట్నాన్ని అప్పుగానైనా పుచ్చుకోకూడదని శపథంపట్టిన ఆదర్శవాది కృష్ణమూర్తి మాట్లాడిన ఈ మాటలు, అతడి స్వభావాన్ని ఎరిగిన దుర్గకుగాని, మనోరమకు గాని ఆశ్చర్యం కలిగించలేదు.

అంతేకాదు—

క్రమంగా వ్యాపారం విస్తరించి, రాబడి, ఖర్చుకూడా ఎక్కువై, ఇవన్నీ పరిచూస్తూ వుండే గుమాస్తా అవసరం నానాటికీ మరింతగా కనుపిస్తూ వుండేసరికి కృష్ణమూర్తి తన ఉద్యోగాన్నిమానేసే ఆలోచనలోపడ్డాడు. అయితే ఇంకా ఏ నిర్ణయానికీ రాలేకపోతున్న సమయంలో ఒక సంఘటన జరిగింది:

ఆఫీసులో సెక్షన్ హెడ్‌కి కృష్ణమూర్తి అంటే వున్న కార్పణ్యంకొద్దీ చెప్పిన మాటలు పట్టుకుని హెడ్‌క్లర్కు కృష్ణమూర్తిని దండించడం మొదలు పెట్టాడు. ముందు సెక్షన్ హెడ్ చెప్పినట్లల్లా వినడం తన విధి అని కృష్ణమూర్తిని ఆదేశించాడు.

ఈ నిరంకుశత్వానికి కృష్ణమూర్తికి ఒళ్లుమండింది

"నాకు కూడా సమంజసమనితోస్తే తప్ప కేవలం ఆయన చెప్పాడుగదా అని మాత్రం నేను చెయ్యను. అసలు విషయమేమిటో నన్నుకూడా చెప్పనివ్వండి—బంజరు భూములకోసం సీతానగరాన్నుంచి వచ్చిన విషయం ముందుచూడండని ఆయన తొందర చేయడం మొదలు పెట్టాడు. అంతకంటె పాతకాగితాలు పెండింగులో వుంటే, వాటికంటెకూడా ముందు దీని వ్యవహారం చూడమంటాడు. పైగా ఆ భూమిన్ని ఇంతకు పూర్వం నుంచీ సాగుచేసుకుంటున్నామంటూ, అక్కడినుంచి మరొక పిటీషనువచ్చింది. ఈ పిటీషను లెక్కలోకి రాకముందే కాగితాలు పైకి పోవాలని ఆయనతొందరపడుతున్నాడు. ఇలాటి మాటలు నేను వినను; వినక్ఖర్లేదు" అన్నాడు కృష్ణమూర్తి

"ఇదంతా అనవసరం. ముందు నువ్వు నీసీటులోకివెళ్ళి, ఆయన చెప్పినట్లు చెయ్యి!" హెడ్‌క్లర్కు మళ్లా ఆదేశించాడు.

"నేను చెయ్యనని ఇప్పుడే చెప్పాను!" అన్నాడు కృష్ణమూర్తి.

హెడ్‌క్లర్కు ఉగ్రుడై "నీ విషయం కలెక్టరుగారిదాకా వెడుతుంది సుమా! జాగ్రత్త" అంటూ బెదిరించాడు.

"అంతదాకా ఆగను. ఇప్పుడే రాజీనామా ఇచ్చేస్తున్నాను ఇదిగో కాగితం పంపుతాను" అని వెళ్ళిపోబోయాడుకృష్ణమూర్తి

'ఎంత అవమానమైనా దిగమింగి ఉద్యోగాలు నిలబెట్టుకోవాలి' అనేమన స్తత్వంతో ఇన్నేళ్లుగాబతుకుతూవచ్చిన సెక్షన్ హెడ్ హెడ్‌క్లర్కు ఇద్దరూ కృష్ణమూర్తి మాటలకు నిశ్చేష్టులయారు

"కృష్ణమూర్తీ! ఎందుకు తొందర పడతావు? వృద్ధిలోకి రావలసినవాడివి!" అన్నాడు సెక్షన్ హెడ్ ఒక క్షణానికి తెప్పరిల్లి.

"ఇలాటి చోట వుంటే ఎప్పటికీ వృద్ధిలోకి రాను. అవసరమైనప్పుడు కూడా తొందరపడకపోతే అసలెవృద్ధిలోకి రాను!" అని వెళ్లిపోయి కృష్ణమూర్తి రాజీనామా కాగితం రాయడం మొదలు పెట్టాడు.

అసలు ఈతగూ ఎలా పరిణమిస్తుందోనని కాసుక్కూచున్న తోటి గుమాస్తాలంతా కృష్ణమూర్తి బల్లచుట్టూచేరి ఆకాగితంచూచి ఆశ్చర్య పోవడం మొదలు పెట్టారు.

"ఉద్యోగంమానేస్తావుట్రా!" అన్నాడు గోపాలరావు

ఇది లేకపోతే ఇక జీవితమే లేని మిగతా అభాగ్యులంతా విస్తుపోయి చూడడం మొదలుపెట్టారు.

"మరేం ఫరవాలేదు. మా ఆవిడికి ఒక ఎక్కౌంటెంటు కావాలి. అవని చేస్తాను" అన్నాడు కృష్ణమూర్తి

కృష్ణమూర్తి స్వభావం సరిగా తెలియని మిత్రబృందం అంతా వెటకారంగా నవ్వింది.

హెడ్‌క్లర్కు మహాశయుడు తలపాగా సవరించుకుంటూ ఆదరాబదరా కలెక్టరుగారి గదిలోకి వెళ్లి, కృష్ణమూర్తి "అవిధేయత" గురించి విన్నవించుకున్నాడు.

కలెక్టరుగారు అంతా విని ఒక నవ్వు నవ్వి, "మీబోటి జీతగాణ్ణి పెట్టుకోగల స్థితిలో వున్నాడండీ, ఇప్పుడాయన! అందువల్ల మీకు విధేయతచూపే దేమిటి-అనుకొని వుంటాడు లెండి!" అన్నాడు.

ఈ మాటల అర్థం ఏమిటో పూర్తిగా అవగాహన కాని హెడ్‌క్లర్కు మహాశయుడు కలెక్టరుగారి "కుటిలత్వాన్ని" మనస్సులో మరొకసారి ఈసడించుకున్నాడు.

* * *

"కలెక్టరుగారు సమర్థులు కాబట్టి, ఈ విషయాన్నంతా కట్టుకథను మరిపించేటట్లుగామీకు చెప్పారు ఒక్క విషయం మాత్రం నేను ఈ క్లబ్బు వార్షికోత్సవ శుభ సమయాన మీకు విన్నవించుకోదల్చుకున్నాను-మీవల్లనే నేను వృద్ధిలోకి వచ్చానని ఎల్లప్పుడూ గుర్తుంచుకుంటాను. న్యూయింగ్ స్కూల్ ఏర్పాటు ద్వారా, క్లబ్బుమెంబర్లలో కావలసినవాళ్ళకి కుట్టుపని నేర్పి, మీఋణం కొంతవరకు తీర్చుకోబోతున్నందుకు చాలా సంతోషంగావుంది. మీరు చూపిన ఆదరణకు ఎల్లప్పుడూ కృతజ్ఞురాల్ని!" అని దుర్గ ముక్తసరిగా తన ప్రసంగాన్ని ముగించింది.

ఇంతలో కలెక్టరుగారు మళ్లీ మైక్ ముందుకి వచ్చి, "పాపం! ఈ అమ్మాయి మీరు చూపిన ఆదరణకు కృతజ్ఞత తెలుపుతోంది! మీరు ఇంతకు పూర్వం చూపింది ఆదరణ అని మీకు తెలిసివుంటే, అసలు అటువంటి ఆదరణ చూపించే శ్రద్ధ మీలో ఎవరూ తీసుకునే వారు కాదేమో! మీ ఆడవాళ్ళ సంగతి నాకు అట్టే తెలియదు కాని, మా మగవాళ్ళయితే ఇటువంటి సమయాల్లో ఏమి చేసేవాళ్లో నాకు బాగా తెలుసు" అన్నారు.

ఈమాటల్ని గురించి తగినంతగా వాళ్ళలో ఎందరు ఆలోచించారో తెలీదు గాని, అందరూ దీర్ఘంగా చప్పట్లుమాత్రం కొట్టి, చాలా సేపు నవ్వారు.

(అయిపోయింది)

డిటెక్టివ్ సీరియల్

# అపూర్వ హంతకులు

మూలం: ఎడ్గార్ వాలెస్ | అనువాదం: 'వినాయక'

## 'బాకా' కార్యాలయంలో దురంతం!

## 5

'బాకా' సంపాదకుడు ఎక్కడో విందు భోజనం ఆరగించి గబగబా ఆఫీసుకు వస్తున్నాడు మేడమెట్లెక్కుతూంటే ప్రధాన సంపాదకులతనికి దోవలోనే తారసపడ్డారు. ఈయనగారికి ఏళ్లు బాగా పైబడ్డా ఇంకా పసిపాపలాగే కనిపిస్తారు! ఇంతవరకు 'బాకా భవంతి' నిర్మాణాన్ని గురించి పగటికలలు కంటున్న ఈ ప్రధాన సంపాదకులు హఠాత్తుగా ఈ లోకంలో పడినవారై సంపాదకుణ్ణి చూచి "అయితే ఆ హంతకుల సమాచారం ఏమైనా తెలిసిందా?" అని ప్రశ్నించారు

దానికి సంపాదకుడిలా సమాధానం ఇచ్చాడు "రోజు రోజుకీ ఈ హంతకులను గురించిన గందరగోళం బాగా హెచ్చు పెరిగిపోతూ నేఉంది!

వచ్చే పార్లమెంటు సమావేశంలో విదేశీయ బహిష్కార శాసనం చర్చ మొదలెడతారు. ఎవరినోట విన్నా ఈ చర్చని గురించిన ఆందోళనే! ప్రభుత్వం సర్ ఫిలిప్ రేమన్‌కు ప్రాణాపాయం రాకుండా గట్టిగా కట్టుదిట్టాలు చేసింది."

"అయితే మొత్తంమీద జనం అంతా ఏమనుకుంటున్నారో?"

సంపాదకుడు బుజా లెగరవేసి—

"పార్లమెంటులో బాంబు దురంతం జరిగినా—ఎవళ్లకీ ఏమీ పట్టడం లేదు!" అన్నాడు.

ప్రధాన సంపాదకులు క్షణకాలం ఆలోచించి—"ఇంతకీ మీ రేమంటారు?" అన్నాడు.

సంపాదకుడు పకక్కన నవ్వి, "ఇంత చేస్తే చివరికి ఏమీ జరగదనే నా నమ్మకం! ఈసారి ఈ నలుగురు గట్టిగా శోకరాతిన్నారన్నమాటే! ముందుగా మంత్రికి హెచ్చరిక చేసిఉండకపోతే ఏదైనా కొంత పని జరిగి ఉండేదేమో! తీరామోసి ఆ హెచ్చరిక చేసిన తరువాత—"

పిమ్మట ప్రధాన సంపాదకులు 'సరే' నని స్వగృహోన్ముఖులైనారు.

"ఈ హంతకుల గోల ఇంకా ఎంతకాలం దాకా నిలబడుతుందో!" అని సంపాదకుడనుకున్నాడు. మెల్లిగా ఆఫీసు మేడ మెట్లెక్కుతూ మంత్రిని చంపడం అసలు జరిగే పనికాదనీ, అయినా ఇందుమించుగా అంతపనీ జరిగితే బాగుండుననీ ఉవ్విళ్ళూరాడు.

ఆయన గదికి తాళంవేసి ఉంది. కొంచెం సేపు తాళం చెవికోసం జేబులు తడుముకొని అతి కష్టంమీద అది పట్టుకొని మెల్లిగా గది తలుపు తీసి లోపలికి వెళ్ళాడు. లోపల అంతా చిమ్మ చీకటి! వెంటనే లైట్ స్విచ్చి నొక్కాడు.

అంతే! కళ్లు జిగేల్‌మనేటట్లొక పెద్ద మెరుపు మెరిసింది! హఠాత్తుగా దీపం ఆరి ఊరుకుంది! మళ్లీ గది అంతా గాఢాంధకారం!

సంపాదకుడు హడిలి పోయాడు. కంగారుగా గదినించి ఇవతలకివచ్చి, లైటుకోసం కేక వేశాడు.

"ఆ దరిద్రగొట్టు ఫ్యూజేదో తగలడిపోయి

---

**జరిగిన కథ:-**

స్పెయిన్ దేశంలో ప్రభుత్వానికి వ్యతిరేకంగా తిరుగుబాటు జరుగుతున్న రోజుల్లో విప్లవకారులు ఇంగ్లాండులో మకాం వేశారు. వాళ్ళని వెళ్ళగొట్టడంకోసం ఆంగ్లదేశమంత్రి పార్లమెంటులో ఒక చట్టం ప్రవేశపెట్టాలని అనుకున్నాడు.

న్యాయపరిరక్షణభారం వహించిన నలుగురు 'అపూర్వ హంతకులు' ఆ చట్టం ప్రవేశపెడితే మంత్రిని చంపివేస్తామని బెదిరిస్తూ ఉత్తరం రాశారు. 'బాకా'పత్రిక ఆ ఉత్తరం నకలు ప్రకటించడంతో ఊరూ వాడా గుప్పుమంది.

పార్లమెంటులో ఈ చట్టం ప్రవేశపెట్టే ముందు ఒకసభ్యునికి ఒక ఉత్తరం అందింది అది 'అపూర్వ హంతకులు' పార్లమెంటు సభ్యులను చట్టం ఆమోదింప జేయవద్దని హెచ్చరిస్తూ రాసిన బెదిరింపు ఉత్తరం! దీనితో పార్లమెంటుసభ్యులలో పెద్ద అల్లకల్లోలం బయలుదేరింది! తరవాత ఆనిజాయితీపరులు నలుగురు లిమిటెడ్ కంపెనీ పెట్టి ఒక పెద్దభవనం అద్దెకు తీసుకుని దానిలో వ్యాఖ్యానసన్నాహాలు ప్రారంభిస్తారు. తరవాత, మాన్‌ఫ్రెడ్ గోన్సాలెజ్ లిద్దరు పరిశోధన చేసి ఒక విచిత్రమైన మారణపదార్థం తయారు చేశారు

# ★ అపూర్వ హంతకులు ★

పట్టుంది. వెంటనే పనిమనిషిని పిలు!" అని బిగ్గరగా అరిచాడు.

ఇంతలో అక్కడ కొక దీపం వచ్చింది. కాని అంతటా దట్టంగా పొగ అలుముకు పోయింది. తరవాత లైను బాగుచేసే పని మనిషికూడా లోపలికి వచ్చాడు. ఎవరో మొత్తంమీద గదిలో ఉన్న బల్బులన్నీ తీసి వేసి జాగ్రత్తగా ఒక బల్లమీద పేర్చారు. ఒక స్విచ్చి దగ్గరనుంచి ఇనపతీగ చుట్టలు చుట్టలుగా నేల మీదకి వేలాడుతూంది. దానికి జతపరిచిన నల్లని కర్ర పెట్టె ఒకటి నేలమీద కనబడింది. దానిలో నించి దట్టంగా పొగ బయలుదేరుతూంది!

"కిటికీలు తెరు!" అన్నాడు సంపాదకుడు. తరవాత ఒక సాకరు బాల్చీతో నీళ్ళు పట్టుకు వచ్చి, ఆ పెట్టె అతి జాగ్రత్తగా ఆ నీళ్ళల్లో జారవిడిచాడు.

తరవాత ఎడిటరు బల్లమీద ఒక ముదురు బూడిదరంగు కవరు కనిపించింది. ఆయనగారది తీసుకుని అటుఇటు తిప్పాడు. వెంటనే అది విప్పాడు. ఆ కరు అప్పుడే అంటించారో ఏమో! కొంచెం జిగురు చేతికంటుకుంది. అది సంపాదకుని పేర రాసిన ఉత్తరం.

"మహాశయా!

హంతకుల దురంతాలను గురించి ఇటీవల మీరు చాలాసార్లు ఉట్టంకించి ఉన్నారు. ఈ వేళ సాయంత్రం స్విచ్చి వెయ్యగానే ఆ 'దురంతం' మీ మీదే విరుచుకు పడిందని మీరూహించి ఉండవచ్చును. మిమ్మల్నీ ఈ విధంగా కొంచెం ఇబ్బంది పెట్టినందుకు మేము చాలా చింతపడుతున్నాం. మీ గదిలో ఒక చోట లైటు తీసివేసి దానిస్థానే ఒక ప్లగ్ పెట్టాం. దానిలోనించి ఒక తీగ ద్వారా మెగ్నీషియం పొడి అంటుకునేటట్లు చేశాం. ఇదే మీ కింత కంగారు కలిగించింది. అక్కడ కొంచెం 'డైనమైట్' పెట్టడం కూడా చాలా తేలికే. అదే జరిగి ఉంటే— మీ రిపోటికి పరలోకానికి విజయం చేసి ఉండేవారు! విదేశీయ బహిష్కరణ శాసనం పార్లమెంటు ఆమోదం పొందింతంటే మంత్రిని హత్యచేసి తీరతామని మేం మిదివరకే తెలియజేశాం! మా దృఢ నిశ్చయానికిది ఒక మచ్చు మటాకీగా అందించాం. ప్రపంచంలో ఎవ్వరూ ఇక మంత్రి ప్రాణాలురక్షించలేరు! మీది అనన్య సాధారణ ప్రచారంగల పత్రికా రాజం! మీరు మీ శక్తిసామర్థ్యాలన్నీ ఉపయోగించి ప్రభుత్వం ఈ చట్టం ఉపసంహారించేటట్లు చెయ్యవలసిందని న్యాయ సంరక్షుణ కారం వహించ వలసిందనీ కోరుతున్నాం. ఈ చట్టం పార్లమెంటులో ఆమోదింప చెయ్యడం చాలా అన్యాయం! ఇది ఉపసంహరింపజేస్తే-- ఈ దేశంలో తలదాచుకుంటున్న చాలామంది అమాయికులకు ప్రాణదానం చేసినవా రౌతారు! ఇందులో ఆంగ్ల దేశ మంత్రి ప్రత్యేకంగా చేసిన తప్పిదమేమీ లేకపోయినా, ఆయన ఈ చట్టం ఎలాగయినా ఆమోదింప జెయ్యాలని గట్టిగా పట్టుతున్నారు! ఇందువల్లనే మేమీ తీవ్ర చర్య తీసుకోవలసిన ఆవశ్యకత ఏర్పడుతున్నది. మీరీ చట్టం ఉపసంహరింపజేస్తే మంత్రి ప్రాణాలుకూడా దక్కించిన వారౌతారు.

(సం) నలుగురు న్యాయ సంరక్షకులు.

ఎడిటరు హాయిగా కాలవేసి, నుదురు మీద పొటమరించిన చిరుచెమట తుడుచుకుంటూ ఆ బాల్చీ నీటిలో తేలుతున్న పెట్టె కేసి పరీక్షగా చూశాడు.

"ఏమిటి బాబు! ఈ గందరగోళం?" అని ఆ పనిమనిషి ధైర్యంగా అడిగాడు.

"ఆఁ ఏమీలేదులే! మళ్లీ ఆ బల్బులన్నీ జాగ్రత్తగా తగిలించి, వెంటనే నీపని ముగించి వెళ్లిపో!" అన్నారు ఎడిటర్జీ సాధికారంగా!

లైను పనిమనిషికింకా తృప్తికలగలేదు. తెగిన తీగకేసీ, నీళ్లలో తేలుతున్న పెట్టె కేసీ విచిత్రంగా చూస్తూ—

"ఇదేదో చాలా చిత్రంగా ఉంది బాబూ! - నన్నడిగితే -" అన్నాడు.

"నిన్నేమీ అడగడంలేదులే! ముందు తొందరగా పని పూర్తిచెయ్!" అన్నాడా మహామహుడు!

"మీరు కోపగిస్తే మరి నే నేమనగలను గాని - చాలా చిత్రంగా ఉంది బాబూ!" అన్నాడు మళ్లీ ఆ పనివాడు.

అరగంట తరవాత వాకా సంపాదకు డీ విషయం అంతా విదేశ వార్తా సంపాదకుడు వెల్చీతో చర్చించాడు.

ఈయన లండన్లోఉన్న వా రందరిలోను చాలా ఘటికుడు!

వెల్చీ కొంచెం మర్యాదగా పల్లకిలించి, తన ఆశ్చర్యం అంతా ఈవిధంగా వెళ్ళగక్కాడు:

"వీళ్లు చెప్పిందంతా చేసి తీరతారని నేను అనుకుంటూనే ఉన్నాను. ఇప్పుడిక వీళ్లు తమ పంతం అంతా నెగ్గించుకు తీరతారనే నా నమ్మకం!"

ఈ విదేశవార్తల సంపాదకు డెవరికీ తెలియని వింత వార్తలు సంపాదించడంలో చాలా గట్టివాడు. ఇతగాడింకా ఇలా గన్నాడు.

"నేనప్పుడు వెనీసులో ఉన్నానో సోఫియాలో ఉన్నానో బాగా జ్ఞాపకం లేదు.

అక్కడ నా కొక హత్య సంగతి తెలిసింది. సెర్వియారాజును చంపివేసిన ట్రిలోవిచ్ వ్యవహారం మీకు కొంచెం జ్ఞాపకం ఉండి ఉండవచ్చును. ఆ సైన్యాధిపతి ఒక నాటిరాత్రి నాటకం చూడడానికి వెళ్లాడు. అంతే! ఆ మర్నాడు పొద్దున్న నాలుగు వీధుల మొగలో చచ్చిపడి ఉన్నాడు! ఎవరో అతన్ని గుండెల్లో పొడిచి చంపేశారు. ఆ హత్యలో రెండు అత్యద్భుత విషయాలు బైటపడ్డాయి. మొదటిది—ఆ సైన్యాధిపతి కత్తిసాములో గట్టివాడు! అందుచేత అతనికీ—ఆ హంతకునికీ కత్తులతో ద్వంద్వయుద్ధం జరిగిఉండాలి. రెండవది సైన్యాధిపతి లోపల ఒక కవచం వేసుకున్నాడు! ఆ హంతకు డతన్ని కత్తితో పొడిచిన తరవాత—అతడా కవచం విప్పి ఇవతల పారేసి ఉండాలి. ఏది ఏమైనా మర్నాడా కవచం ఆ సైన్యాధిపతి శవానికి దగ్గరగా పడిఉంది!"

"ఈ అపూర్వ హంతకు లెవరైనా ఆ

## ఒక నిమిషంలో

ఈ క్రింది ప్రశ్నలలో ఒక్కొక్కదానికి ఒక నిమిషంలో సమాధానం చెప్పాలి.

(1) ఒక వడ్రంగి ఒక పెద్ద బల్లచెక్కను రెండు నిలువు చెక్కలుగా కోయడానికి అణా న్నర పుచ్చుకుంటాడు. నాలుగు నిలువు చెక్కలుగా కోయడానికి ఎంత పుచ్చుకుంటాడు?

(2) ఒక మనిషి పొడుగు, మూడు అడుగులపైన అతనిలో సగం ఉన్నది. అతడు ఎంత పొడుగున్నాడు?

(3) ఒక పంది రెండుజతల కవలపిల్లల్ని రెండు సార్లు పెట్టింది. మొత్తం దాని కెన్ని పిల్లలు?

(జవాబులు-౨౫ పేజీలో చూడండి)

హత్య చేసిఉంటారనడానికి!—దాఖలా లేమైనా కనిపించాయా?"

వెర్నీ తలఅడ్డంగాతిప్పి—"నేను కూడా అంతకు పూర్వం ఈ హంతకుల సంగతి ఎన్నడూ విననేలేదు!" అన్నాడు. తరవాత ఒక నిమిషం ఊరుకుని—

"అయితే మీ గదిలో జరిగిన దానికి—మీ రేం చేశారు?" అన్నాడు.

దీనికి ఖంపాదకుడిలా సమాధానం చెప్పాడు.

"అక్కడ కాపలా కాసే వాళ్ళనీ, నౌఖర్లనీ, అందరినీ గుచ్చిగుచ్చి అడిగాను. అయితే కొత్తమనిషి అక్కడికి రావడం, వెళ్లడం మాత్రం ఎవళ్ళకీ అంతు పట్టడం లేదు. అక్కడికి వచ్చిన వాడు ఒక్కడే అయి ఉండాలి. ఇదంతా చూస్తే చాలా అద్భుతంగా ఉంది. అంతవరకు ఎందుకు ఆ కవరు అప్పుడే అతికించి ఉండాలి. అది ఇంకా తడితడిగానే ఉంది. ఇది తలుచుకుంటే నా కింకా బెదురుగానే ఉంది. నేనా గదిలోకి వెళ్ళడానికి ముందే—ఎవరో అక్కడికి వచ్చి, ఆ ఉత్తరం రాసి, వెంటనే ఆ కవరతికించి, అక్కడ పెట్టి వెళ్ళిపోయి ఉండాలి!"

"కిటికీలు తెరిచే ఉన్నాయా?"

కిటికీలన్నీ గట్టిగా బిగించే ఉన్నాయి. ఆ విధంగా లోపలికి రావడానికే మీ ఆస్కారం కనబడదు."

అదంతా జాగ్రత్తగా పరిశీలించి రిపోర్టు తయారు చెయ్యడానిక్కడికి వచ్చిన అపరాధ పరిశోధకుడు కూడా అదేవిధంగా వంత పాడాడు:

"ఈ ఉత్తరం రాసిన మనిషి మీ రిక్కడికి వచ్చిన ముందు నిమిషంలోనే ఇక్కడి నించి వెళ్లిపోయి ఉండాలి." అని చెప్పి ఆ ఉత్తరం దఖలు పరుచుకున్నాడు.

డిటెక్టివ్ చాలా చురుకైన వాడు. ఆ పైన అతనికింకా ఈ వ్యవహారాల్లో కుర్రతనం వదలలేదు. అందుచేత చాలా జాగ్రత్తగా ఆ గది అంతా గాలించేశాడు. గది గోడలు ఓటు పలుకుతున్నాయేమోనని ఒకసారి మెల్లిగా కొట్టి చూశాడు. గదిలో ప్రతి అంగుళము టేపుతో కొలిచి లెఖ్ఖలు తీసుకున్నాడు. అడుగుబద్దతో ఆ గది అంతా మళ్లీ సర్వే చేశాడు. ఇదంతా విడ్డూరంగా చూస్తూ విస్తుపోయిన ఎడిటర్‌తో ఇలాగన్నాడు:

"డిటెక్టివ్ కథలంటే మన వాళ్ళకి చాలా మందికి ఒట్టి వెటకారము, వేళాకోళమూను! కాని నేను కొనన్‌డాయిల్ రాసిన ప్రతి అక్షరము కంఠతా పట్టాను! అందుకనే ప్రతీదీ అతి జాగ్రతగా కొలిస్తేనే గాని నాకు నిద్రపట్టదు! ఈ గదిలో

# ★ అపూర్వ హంతకులు ★

ఎక్కడైనా సిగరెట్టుపొడి రాల్చిన అన వాళ్ళేమైనా కనిపించాయా?"

"ఏమీ లేవనుకుంటాను!" అన్నారు ఎడిటర్గారు అతి గంభీరంగా.

డిటెక్టివ్ 'అలాగా!' అని అక్కడ ఉన్న పేలుడు సామానంతా ఒక చిన్న మూట కట్టించి అది పట్టించుకు వెళ్ళిపోయాడు.

తరవాత ఎడిటరు వెల్బీతో ప్రసంగిస్తూ ఇంకొకాయన దుర్భిణీతో ఆ గది అంతా ఇంకోసారి గాలించేశాడని చెప్పాడు.

"కిందటి వారం నేను పారేసుకున్న పెన్సిలు తప్ప మరేమీ దొరకలేదు—దుర దృష్టం—"

ఆ ఇద్దరికీ తప్ప మరెవ్వరికి ఆ గదిలో జరిగిన విడ్డూరం సంగతి తెలియలేదు!

వేరే ఒక గదిలో సబెడిటర్లంతా కలిసి బాతాఖానీ కొడుతున్నారు. ఒకాయన "గర్భగుడిలో ఏదో కొంచెం ప్రమాదం జరిగినట్టుందే!" అన్నాడు

ఓడలు రాకపోకలు రాసే సబెడిటరు "ఎడిటరుగారు స్విచ్ నొక్కేసరికి గది అంతా ఒక్కసారిగా గప్పుమంది! దాంతో హడలెత్తిపోయి, ఇవతలికి పరుగెత్తు కొచ్చారు" అన్నాడు.

ఇక వాతావరణము, వానజల్లులు చూసే సబెడిటరు ఎదురుగా ఉన్న కాయితం కేసి చూస్తూ—

"ఇదిగో! సరిగ్గా నిన్న రాత్రి నాకూ ఇలాగే ప్రాణం పోయేటంత పనిజరిగింది!" అన్నాడు.

డిటెక్టివ్ తిరిగి వెళ్ళేముందు ఎడిటరతని కొక గట్టి మోతాదు తగిలించి—

"ఒక్క మీకు, నాకు, తప్ప ఈ వ్యవహారం రెండోకంటివాడి కెవడికీ తెలియదు! ఇది ఏ మాత్రమైనా బయటికి పొక్కిందంటే—అది స్కాట్లండ్‌యార్డ్ పనే నన్నమాట! తెలిసిందా?" అన్నాడు.

మేమింతకు పూర్వమే దీనివల్ల చాలా పెద్ద బెడదలో పడిపోయాం. మామూలంగా ఒక్క ముక్క కూడా పైకి పొక్కదు!" అన్నాడు డిటెక్టివ్.

అద్దదీ! బాగుంది!" అన్నాడు ఎడిటర్. ఈ 'బాగుంది!' అన్నదానికి 'జాగ్రత్త! ఖబడ్దార్!' అన్నమాట!

ఆవేళ 'బాకా' అచ్చయేదాకా ఎడిటరు వెల్బీ—ఇద్దరు ఈ వార్త అతి రహస్యంగా తొక్కిపెట్టారు

ఈ జాగ్రత్త చూస్తే సామాన్య మానవాళికి చాలా ఆశ్చర్యం కలగవచ్చునుగాని వేడి వేడి తాజావార్తలు - అచ్చుకాకుండానే అంచెలమీద - పైకి వెళ్ళిపోతాయని పేపర్లు నడిపించేవారందరికీ తెలిసిన సంగతే!

కంపోజిటర్లు చాలా దుర్మార్గులు! - ఈ వ్యవహారంలో కంపోజిటర్లంతటి సామాన్యులు కూడా అఘాయిత్యాలు చేసేస్తారు! సందేహం లేదు! వీళ్ళలో కొంతమంది ప్రత్యేకంగా వచ్చిన తాజావార్తల కాపీలు కిటికీలగుండా వీధుల్లోకి విసిరివేస్తారు! అక్కడ వీటికోసం పొంచిఉన్న ఘరానా మనుషులు కొంతమంది వెంటనే ఆ కాపీలు పోటాపోటీలుపడే సాటి పేపర్ల కమ్మేస్తారు! పైవాళ్లు ఆ కాపీల కక్షర లక్షలిచ్చి కొనేస్తారు! ఇలాంటి వెన్నెన్నో పత్రికల్లో జరుగుతూంటాయి!

ఆ తరవాత ఒక అరగంటకి బాకా కార్యాలయంలో సముద్రపు హోరు మారు మోగింది. అంటే - పత్రిక అచ్చయిపోయిందన్నమాట! అందాకా సబెడిటర్లెవరికీ, తమ కార్యాలయంలో జరిగిన అఘాయిత్యం సంగతి తెలియనే తెలిదు!

ఆవేళ బాకా పత్రికలో మొదటి పేజీలో పెనించి చివరిదాకా అన్నీ తాటికాయ శీర్షికలే!

'మళ్ళీ అపూర్వ హంతకులు!'

'బాకా పత్రికలో ఘోరప్రమాదం!'

'అసాధారణ రాక్షస కృత్యం!'

'తిరిగీ ఇంకో బెదిరింపు!'

'అపూర్వ హంతకులు తమ కంతం తగ్గించుకుంటారట!'

'అత్యద్భుత లేఖ!'

'పోలీసులు మంత్రి ప్రాణాలు రక్షించగలరా?'

ఈవిధంగా శీర్షికలు దొర్లిపోయాయి!

ప్రధాన సంపాదకులు వీటి ప్రూఫులు చదువుతూ "చాలా క్షేమంగ్గాఉందే!" అన్నారు!

ఇంతలో వెల్బీ అక్కడికి విచ్చేశాడు.

ప్రధాన సంపాదకు లతనితో "మొత్తం మీద బాగానే ఉంది—నా అభిప్రాయం

"మీ ఆయనకి కొంచెం చెవుడు ఉన్నట్లుందేమమ్మా?" అని అడిగింది పక్కింటిఇల్లాలు.

"కొంచెమేం ఖర్మం తల్లీ! మొన్న గావును పెద్ద పిడుగు పడింది మన ఇళ్ళకి దగ్గరలో. అది విని నన్నడిగారు 'అలా దగ్గకపోతే ఏవన్నా మాత్రలు వేసుకోరాదా,' అని."

ఏమిటంటే—" అని ఏదో చెప్పి, వెంటనే ఇంటికి బయలుదేరాడు.

ఇంతలో ఒక నౌఖరక్కడికి వచ్చాడు. ప్రధాన సంపాదకుడతన్ని చూస్తూనే— "ఏమిటి కథ" అన్నాడు. ఆ నౌకరు వెనకాల ఎవరో ఇంకో కొత్త మనిషి కనిపించాడు.

ఆ నౌఖరు ప్రధాన సంపాదకునితో ఇలాగన్నాడు.

"ఈయనెవరో కొత్తాయన - ఇక్కడివారెవరితోనైనా - అర్జంటుగా మాట్లాడాలంటున్నారు సార్! ఆయన దీదేశం కాదు. ఆ చెప్పేదేదో నాకు తిన్నగా తెలియడం లేదు! అందుచేత మీ దగ్గరికి తీసుకు వచ్చాను సార్!"

"మీ కెవరు కావాలి?" అన్నాడు ప్రధాన సంపాదకుడు ఫ్రెంచి భాషలో. కొత్త మనిషి తలపంకించి గబగబా ఏదో మాట్లాడాడు! అది ఏవరికీ బోధపడలేదు.

వెల్బీ ఆ మాటలు విని "అది స్పానిష్ భాష" అన్నాడు. వెంటనే ఆ మనిషి కేసి తిరిగి, ఆ భాషలోనే "మీ కేం కావాలి?" అన్నాడు. "ఇది ఈ పేపరు ఆఫీసేనా?" అన్నాడా కొత్త వ్యక్తి బాకా పత్రిక కాపీ చూపిస్తూ.

"అవును"

"నేను ఎడిటరుతో మాట్లాడాలి."

ప్రధాన సంపాదకుడు కొంచెం అనుమానపడి ఆ ఎడిటర్ని నేనే అన్నాడు.

కొత్త మనిషి ప్రధాన సంపాదకుల బుజం దగ్గరిగా వంగి కొంచం తటపటాయిస్తూ—

"నేనా అపూర్వ హంతకులలో వాణ్ణే!" అన్నాడు.

"నీ పేరేమిటి?" అన్నాడు ప్రధాన సంపాదకుడు నిర్ఘాంతపడి

"క్షేరి!" అన్నాడా కొత్తవ్యక్తి!

[ఇంకా ఉంది]

# మారిన విలువలు

....ఎత్తులు పరుగు సంకేలు వేస్తున్నయ్ రాజు "ఆగరా ఆగు" అన్నాడు హఠాత్తుగా. ఆగి వాడి మొహం లోకి చూశాను "అలా దూరాన దొర్లుతూ పోతున్న మనుష్య శాల్తీని చూడు" అన్నాడు రాజు ఏమిటోనని చూశాను. ఓ నల్లటి యువకుడు దొర్లుతున్నట్టు నడుస్తున్నాడు ఓ పుస్తకం చదువుతూను అతను పుస్తకం పట్టుకున్న తీరు చూస్తే నవ్వొచ్చింది. కంటికి రెండంగుళాల దూరంలో ఉన్న ఆ పుస్తకం బరువు రెండు మణుగులకు తక్కువ ఉండదనిపించింది. పుస్తకం ధ్యాసలో పడి సముద్రంలోకి నడుస్తోంది ఆ ఆకారం

"అరె! మోకాలులోతు నీళ్ళలోకెళ్లినా తెలియడం లేదు అతనికి మనిషేనా!..." విస్తుపోయి చూస్తున్నాడు రాజు. నేనూ చూశాను దూరాన్నుంచి ఓ కెరటం శర వేగంతో వస్తోంది రాజు పరుగెత్తాడు 'ఏయ్ మిస్టర్! కెరటం వస్తోంది' అని అరిచాడు. ఆ ఆకారం మా వేపు చూసి, చిరునవ్వుతో మా కళ్ళని గాయపరచి తిరిగి నవ్వుతూ కదలిపోయింది.

'ఆత్మ హత్య!' అన్నాడు రాజు. "పాపం అతను యూనివర్సిటీ స్థితి చూడలేక ఆత్మహత్య చేసుకుంటున్నాడు"

ఆ పుస్తకాల పురుగు ఇంకా లోతు కెళ్ళింది ఇక ప్రమాదం తప్పదనిపించింది. పైజామా పైకిముడిచి, చెప్పులు విడిచి, నీళ్లలోకిపోయి ఆ మనిషి జబ్బ పట్టుకున్నాను. "లోపలికి పోతున్నారేం?" అన్నాను. 'వాట్! వాట్!" అంటున్నాడు "వాట్ డూ యూ మీన్ బై" అన్నాడు. తెలుగు తెలియదని తెలిసింది.

"మీరు సముద్రంలోకి పోతున్నారు" ఇంగ్లీషులో అన్నాను

"అవును. మీ కెలా తెలిసింది" అతనూ ఇంగ్లీషులోనే అడిగాడు. నాకు నవ్వొచ్చింది.

"ఓమారు క్రిందికి చూడండి" అన్నాను చూశాడు. ఒణకడం మొదలెట్టాడు

"వ అఆటల్.. వాటీజ్ ది మేటర్!" అన్నాడు అతి కష్టంమీద.

గట్టుమీదకి లాక్కొచ్చాను అతను పైకొచ్చి ఏమీ జరగనట్టే పుస్తకం చదివెయ్యడం మొదలు పెట్టాడు 'థేంక్సు చెప్పడేం!" అన్నట్టు చూశాడు రాజు కొంతసేపు ఇద్దరం అతని పుస్తకపఠనం వీక్షించాక రాజు అంటున్నాడు "వెంట్రుకవాసిలో స్వర్గానికిపోయే మహావకాశాన్ని పోగొట్టినందుకు అతనికి మనమీద కోపంగా ఉందేమో!" అన్నాడు

> "అదిగో, ఆ అమ్మాయే...తెల్లచీర...తెల్లటి మనిషి...బస్సు వేపు నడుస్తోంది...ఏయ్ మొద్దూ అటు చూడు, గాలిలోకి చూస్తావేం? ఆ అమ్మాయేరా...."అని రాజు చెప్పుకుపోతున్నాడు.

ఆ పుస్తకం ఏమిటా అని చూశాను "under the pacific" అని రెండు వేల పేజీల పుస్తకం చిన్న 'అరటావు సైజు పుస్తకం ..

చీకటి పడుతోంది దూరాన నడుస్తున్న అమ్మాయిలు నీడల్లాగా కనిపిస్తుంటే రాజు కళ్లు పొడుచుకుచూస్తున్నాడు మా విచిత్ర వ్యక్తి ఇక చదవడం అసాధ్యం అని గుర్తించాడు. ఆ ఆలోచన అతనికి సుతరామూ కిట్టినట్టు కనిపించదు

"అయ్యా! మీలో ఎవరివద్దనైనా కర విద్యుద్దీపికగలదా నేనీదినమున 'చీకటి పడు లోగా' నూరు పేజీలు మాత్రమే చదువ వలసి యున్నది......" ఇంగ్లీషులో అర్థించాడు అతను. రాజు కీచుమని నవ్వాడు.

**జ్యేష్ఠ**

టార్చిలైటుతో చీకటి వచ్చే అలవాటు లేదనీ, ఆయన చదువుకి సహాయపడనందుకు విచారిస్తున్నామనీ విన్నవించుకున్నాం. అతను దుఃఖభారాన్ని మరిచిపోడానికి ప్రయత్నిస్తూ.

"మీరు ఏమి చదువుకున్నారు" అని అడిగాడు.

"ఇంజనీరింగే" అని ఏడుస్తూ చెప్పాడు రాజు.

"నేనూ ఇంజనీరింగే" అతను నవ్వాడు-సింహాచలం కొండమీంచి నీళ్లతో ఉన్న ఓ చెంబు దొర్లిపోతే అకే ధ్వని రావడం నేను చెవులారా విన్నాను అది జ్ఞాపకం వచ్చి 'హతోస్మి' అనుకున్నాను

కుప్పుస్వామి (అతని పేరు) కి ఇంగ్లీషు బాగా వచ్చునని గ్రహించాను అతని ఇంగ్లీషు కర్ణకఠోరంగా ధ్వనించినమాట కాదనలేను కాని అది కాగితం మీద చాలా బావుంటుంది అందుచేత అతనంటే సదభిప్రాయం ఏర్పడింది నాకు

వెన్నెల వచ్చింది

ముగ్గురం సముద్రంలోకి చూస్తున్నాం 'మీరు మా యూంలో చేరతారా' తెలుగులో ఆ వేళాను అలవాటుకొద్దీ రాజు గతుక్కుమన్నాడు తనకు భరించరాని అవమానం జరిగిపోయినట్టు భావించాడు 'ఊరుకో' మన్నట్టు చూశాడు "ఏమిటి! ఏదో రూము అంటున్నట్టున్నారు నేను ఏరూంలోనూ చేరలేదు ఎవరూ తెలిసినవాళ్లు లేరు" అన్నాడతను రాజు 'నన్నేమిరా రానివ్వ' నన్నాడు నాతో! 'ఒరే! వెనూరుకోను. ఏంచేస్తానో, తెలుసా! ఊఁ ఏంచేస్తానో తెలుసా! ఇతనంటే ఎంతఅసహ్యంఅంటే? ఎంతంటే .. ఎంతో అసహ్యం అంత అసహ్యం అన్నమాట" తగిన పదజాలం దొరక్క ఇబ్బంది పడుతున్నాడు

నాకు చెప్పి లాభం లేదని గ్రహించాడు రాజు. అతనికి చెప్పసాగాడు: "ఇంజ

# ★ మారిన విలువలు ★

నీరింగు వాళ్ళకి ప్రకృతితో సరాసరి సంబంధం ఉండాలని భావించి చక్కగా పంచ భూతాలకు ప్రవేశమున్న గదులుమాత్రమే వాళ్ళకి కేటాయించారు..."

"నాకు ప్రకృతి అంటే చాలా ఇష్టం." అన్నా డతను. రాజు నిర్ఘాంతపోయాడు. అతను తమిళుడేనా అని అనుమానిస్తున్నట్టు కనిపించాడు. గుటకలు మింగాడు. నాకు నవ్వొస్తోంది వాడిస్థితి చూస్తే. దూరంగా పోయి నవ్వుకుంటున్నాను. వాళ్లు ఏదో మాట్లాడుకుంటున్నారు.

పావుగంట గడిచాక రాజొక్కడు వచ్చాడు. విజయగర్వం వాడి పెదవులమీద పరవళ్లు తొక్కుతోంది. 'శని వదిలింది' అన్నాడు వాడు. 'ఏం' అన్నాను. 'అతను మనరూంకి రానన్నాడు' అన్నాడు.

వాడి ఆనందంచూస్తే చాలాబాధ కలిగింది నాకు. "ఎక్కడుంటాడు పాపం"అన్నాను. "అదే నేనూ అడిగాను టౌన్లో ఓహోటల్లో ఉంటున్నాడుట. అక్కణ్ణుంచి దూరం కాదాఅన్నాను.అతను రెండుమైళ్లుఓదూరం కాదన్నాడు. ఓ పుస్తకం చదువుకుంటూ రోడ్డుపక్కని నడిచిరావడం యెంతో సంతోషం కాద న్నాడు. పైగా అందులో ఎంతో హాయి ఉందన్నాడు. అదే మంచిదని సమర్థించాను

నేను," అన్నాడు తన ప్రతిభకు గర్విస్తూ. "ఏడవలేకపోయావు" అన్నాను. ఓ రాజకీయ నాయకుణ్ణి పదిమందిలోనూ పట్టుకుని "నీకు కులతత్వం తెలియదు", అనేస్తే ఎంత బాధపడతాడో అంతబాధా అనుభవించాడు రాజు. మాతి ముందుకు పొడుచుకొచ్చింది.

'అతనంటే అవ్యాజద్వేషంఏర్పడిందేం? తొలిచూపులోనే శత్రుభావాన్ని రేపడానికి, పదినిమిషాల్లోనే దాన్ని పాముపగగా రూపొందించడానికి ఆ చిన్నవాడేం చేశాడు?' అన్నాను. "పుస్తకపరిజ్ఞానాన్ని నిఘంటువుల్ని బట్టీపట్టడాన్ని తప్ప మరి దేన్నీ చూడవు. అతను ఇందాకా గుడ్‌నైట్ అన్న తీరుచూస్తే పిలిచి చాచ కొడదామని పించింది. అసలే అతని మాతృభాష వీనుల విందుగా ఉంటుంది. మాతృభాషలో మాధుర్యాన్నే ఇంగ్లీషుకి కూడా కలిగిద్దామని ప్రయత్నించి చాలవరకు కృతకృత్యుడయ్యాడు" అన్నాడు."అతనికి ఎంతమంచి ఇంగ్లీషువుందో నీకు తెలుసా?" అన్నాను. "చలేస్తోందిరా బాబీ" అన్నాడు వాడు. టవర్ క్లాక్ ఎనిమిది కొట్టింది.

రూం తాళంతీసి గుమ్మందగ్గర కుర్చీ వేసు కూర్చున్నాను. చేతిలో నవల చదవ బుద్ధి కావడంలేదు. దూరాన రాజు గాలిలో తేలుతూ వస్తున్నాడు. ముష్టివాడు 'నా జీవితమే సఫలము' పాడి, "అయ్యా మూడు రోజుల్నుంచి తిండి లేదు" అన్నాడు. రాజు దగ్గరకెళ్ళి జేబులోంచి ఓనాణెం తీసి (ఎంతో చూడకుండా) ముష్టివాడి గిన్నెలోకి విసిరి రూములోకి గెంతి, "మనసున మల్లెలమాలలూగెనే.."అని పాడేస్తున్నాడు. భావం ప్రస్ఫుటంగా కనిపిస్తోంది.

వీడి ఆనందానికి హేతువేమిటి? లెక్చరర్ క్లాసులోకి రానివ్వకపోతే సినీమా కెళ్ళొచ్చాడా!

"వెన్నెల వెలుగులు విరజిమ్మె ఆ అమ్మాయి......దేవతా మూర్తి..." వాడు మంచంమీద బూట్లతోనే పడుకుని కళ్లు మూసుకుని నెమ్మదిగా అంటున్నాడు. ఏదో ప్రమాదం ముంచుకొచ్చిందని కంగారు పడ్డాను. మంచం దగ్గరకు వెళ్లి చూస్తే రాజు నిద్రపోతున్నాడు. పెదిమలు ఏదో చెప్పబోతున్నట్లు విడి ఉన్నాయి. చిరునవ్వు కనిపిస్తోంది.

ఎవరీ రాజు! మానవతత్వాన్ని పరిశోధిస్తున్నా నంటాడు. పెద్ద పెద్ద సమస్యలు తీసుకుని కథలు రాస్తుంటాడు. ఆటంనుంచి అంగారకగ్రహం వరకు అన్నీ కావాలి వాడికి. ఇప్పటివరకుచూస్తే ఎవరినో ప్రేమించినట్లుకనిపిస్తుంది...కాని వాడి నిద్రలో నాలుగేళ్ళ పాప కనిపిస్తున్నాడు. మనుషులంతా నిద్రాదేవి ముద్దుబిడ్డలే మరి...తల్లి దగ్గర అందరూ పసివాళ్లేగా!

* * *

"అదిగో, ఆ అమ్మాయే... తెల్లచీర... తెల్లటి మనిషి...బస్సువేపు నడుస్తోంది... ఏయ్ మొద్దూ అటు చూడు, గాలిలోకి చూస్తావేం? ఆ అమ్మాయేరా...బస్సెక్క బోతూ వెనక్కి చూసింది...ఆ అమ్మాయే ఊ, కనపడిందా! అమ్మయ్య...బస్సులో కెళ్ళిపోయింది...ఇట్టే కూర్చుందిలే... చేతిలో పుస్తకం కనిపిస్తోంది......" రాజు చెప్పుకు పోతున్నాడు.

బస్సు కదిలిపోయింది. నాకు తీరికగా ఊపిరి పీల్చడానికి వీలైంది.

"బాగా చూశావా!" వాడు ఆతృతగా అడిగాడు. వాడి అనుమానం చూస్తే నవ్వొచ్చింది.

"చూశాన్రా నాయనా...చూశాను... కనులారా చూశాను" అని చెప్పుకోవలసి వచ్చింది.

వాడు ఉత్సాహంగా ఈల వేస్తున్నాడు. ఆర్ట్సు కాలేజీపైన పిట్టగోడమీద నించి చూస్తే చుట్టూ వెలుగులు తొంగి చూస్తున్నాయి భవనాల్లోంచి.

"పగలుకంటే రాత్రే అందంగా ఉంటుందిరా" అన్నాడు రాజు.

కొత్తగా బస్తీలో కాపరం పెట్టిన ఇల్లాలు పనిమనిషిని కుదుర్చుకుంటూ, చెప్పింది : "అమ్మాయ్. నీకిక్కడ ఏకష్టమూ ఉండదు. మాకు పిల్లలింకా లేరు కాబట్టి నీకు ఏ ఇబ్బందీ కలగదు"

"అదేంటండీఅలాగంటారు నాకు పిల్లలంటే మా చెడ్డ ఇష్టం. నాకు ఇబ్బందని మీరు పిల్లల్ని కనడం మానెయ్యకండి."

"అవును పగలు చక్కగా కంట్లో కొచ్చే లోట్లన్నీ చీకట్ల లోతుల్లో దాగుంటే తక్కినదంతా అందంగానే కనిపిస్తుంది మరి" అన్నాను.

"రూముకి పోదాం" అన్నాడు రాజు. "అక్కడ నీకు అంతా వివరించి చెప్తాను. ఈవాళేం చదవద్దు......" రాజు చెప్పేస్తున్నాడు

వాడిలో అంత వుత్సాహం యెప్పుడూ చూడలేదు.

రూమువేపు నడిచాం. అక్కడ వరాండాలో లైట్లు వెలిగించలేదు. మా గదిముందు ఎవరో పెట్టెమీద కూర్చున్నారు. ఎవరేనా బంధువులొచ్చారేమోనని భయపడ్డాం. జంకుతూ, నెమ్మదిగా అడుగులు వేస్తున్నాం.

కుప్పుస్వామి వరండాలోంచి వెలుతురులోకి వ్యాపించుకుని వచ్చాడు "మీకోసం చూస్తున్నాను నాలుగ్గంటలనుంచీ, నేను మీ రూంలో చేరతా" అని సంక్షిప్తంగా చెప్పాడు చిరంజీవి కుప్పుస్వామి మొదట చూసినప్పటికంటె చిక్కిపోయాడు అది అతని అరవహోటలు ప్రభావమేననే ఆలోచనలో నవ్వొచ్చింది. రాజు నిర్ఘాంతపోయాడు.

......మామానాన్ని అనర్థాంగీకారంగా స్వీకరించి పిట్టకైనా తెలియకుండా వచ్చిన దారినే పోతాడని ఆశపడ్డాడు రాజు. అందుకే ఊపిరి బిగపట్టి నేల చూడసాగాను. కుప్పుస్వామి తనది అరవరక్తం అని ఋజువు చేశాడు. "వేగిరం రూం తాళం తియ్యండి. పెట్టె లోపలపెడ్తాను. మెస్సుకి పోదాం. మీరింకా మెస్సుకి పోలేదుగా" గబగబా అనేస్తున్నాడు కుప్పుస్వామి.

"లేదు. ఏం, మీ హోటలు బాగుండ లేదా?"

"వాడు వేయించినగడ్డి, పురుగుల పులుసు వడ్డించేవాడు. చచ్చేమనుకోండి! మరో నాలుగు రోజులుంటే నాలిక తెగిపోయేది" కుప్పుస్వామి తన మాటలకి తనే నవ్వేశాడు......

రాజు ప్రేమలేఖలు రాయడం నేర్చుకుంటున్నాడు.

"ఈ ప్రపంచంలో ప్రేమికులకంటే స్వార్థపరులు ఉండరు. వాళ్లు ప్రేమించిన వ్యక్తులకోసం భాషని ఖూనీ చెయ్యడమే కాకుండా ప్రేమ విలువని తగ్గించేశారు. ప్రేమ వాళ్లతోటే అంతమైపోయే వస్తువనుకున్నారు; అది ప్రేమకు అన్యాయం చెయ్యడమే. వాళ్లు వచ్చే తరాలగురించి ఏమైనా ఆలోచించిఉంటే ఆ లేఖలు భద్రపరిచి ఉంచేవారు కాని ఆ పని ఏ ప్రేమికుడూ ఇంతవరకు చెయ్యలేదు. ప్రేమికులది సంకుచితబుద్ధి" అన్నాడు రాజు.

"నేను వాళ్లలో చేరన్లే" ఎవరో అడిగితే చెప్పినట్టు చెప్పాడు......

రాజుకి ప్రేమలేఖలు రాయడం తెలియడంలేదు. రాజు కథలు రాస్తాడుమరి కథల్లో ప్రేమలేఖలు చాలా నిర్లక్ష్యంగా, సెకండ్లమీద రాసేస్తాడు. అవి వాస్తవికంగాఉంటాయని దబాయిస్తాడు మరి.

...వాడికి జీవితంలో ప్రేమలేఖలంటే అంత సంకోచం!

వాడు చెమటోడ్చి కష్టించి ఓ లేఖ పూర్తిచేశాడు.

లేఖతోబాటు పోస్టుచేసిన కథ "నన్ను విడనాడకురా, స్వామీ!" అంటూ పీక్ల పట్టుక్కుంటూ వచ్చేసింది. లేఖకి జవాబు లేదు.

నాలుగైగు లేఖలు రాశాడు. అవి ఏమయ్యాయో తెలియదు.

తెలుగులో రాయడం మానేసి ఇంగ్లీషులో మొదలెట్టాడు అక్కడికది తనభాష అయినట్లు.

* * *

"ఇంటర్వ్యూ ఒచ్చిందిరోయ్!" రాజు ఓరోజున రూము కెళ్లగానే చెప్పాడు.

"దేనికి? ఓ అదా!" అన్నాను.

"అవును ఆదివారం సాయంత్రం బీచికి రమ్మంది."

"ఎన్ని గంటలకి?"

"ఐదుగంటలకి"

* * *

"మొదట చూడగానే ఏం మాట్లాడాలో తెలియలేదురా"

"ఏంచేశావు. గుటకలు మింగుతూ కూర్చున్నావా!"

#  మారిన విలువలు 

వాడు సిగ్గుపడ్డాడు.

"అబ్బే అదేం కాదు... నేను మాట్లాడ లేదు కృష్ణే మాట్లాడింది. ఎంత బాగా మాట్లాడిం దనుకున్నావ్! మాట్లాడేది అరవ మైనా ఆ వాయిస్‌లో మ్యూజిక్ ఉందిరా!"

నేను తెల్లపోయాను

"కుప్పుస్వామి సాంగత్యదోషంవల్ల కొద్దిగా అరవంలోకి చూడగలిగాను అరవం కుప్పుస్వామి మాట్లాడితే బాగుండదుగాని .. ....",

"అయితే భాష మంచిదేనంటావు!"

"నేను ప్రాణంపోయినా అనను."

"అయితే అరగంటసేపు అంతదగ్గరలో ఉండి అరవం ఎలా వినగలిగావురా" అన్నాను.

"చెప్పే వినవేం? ఆభాషలో మ్యూజిక్ ఉందంటే" వాడు గట్టిగా అన్నాడు.

"ఓరి దౌర్భాగ్యుడా ఎలా మారిపోయావురా!" అనిమాత్రం అనగలిగాను.

"పోనిస్తూ అది ఏమంత ముఖ్యమైంది కాదు" అన్నాడు వాడు

"ఇంతకీ ఆ అమ్మాయి ఏమంటేమిటి?"

"కృష్ణా? కృష్ణ ఏమందంటే.. ఈ ఉత్తరాలు రాయడం, అదీ తనకేం నచ్చలేదందిరా!"

"మరి ఎలా భరించగలిగావురా! మూర్ఛపోలేదూ!"

"ఇంక ఉత్తరాలెందుకు? తనూ ప్రేమించిందట నన్ను"

"ఓరి పిడుగా! నువ్వెప్పుడు కనపడ్డావురా ఆ అమ్మాయికి. అమ్మాయిలు కనిపిస్తారు. అబ్బాయిలు ప్రేమిస్తారు. అంతేగాని ..."

'అఁ మరే! నన్ను చూడకపోవడమేమిటి? ఏ స్టేజిమీదచూసినా మనమే గా! నాగరాజు ది బెస్ట్ స్పీకర్ ఆఫ్ యూనివర్సిటీ'.

వాడు ఆతర్వాత నాలుగైదుసార్లు కృష్ణని చూసివచ్చాడు.

ఓరోజున కృష్ణ చెప్పేసింది. "మనం ఇలా సముద్రం దృష్టిలో పడుతూండడం బాగుండలేదు. వెళ్ళి మానాన్నకి చెప్పుకోండి మీకురించి ఏమంటాడో చూద్దాం..."

ఓ శుభముహూర్తాన రాజు తెల్లారి నాల్గు గంటలకి చలిలో ఒణుకుతూనే చన్నీళ్లలో స్నానంచేసి చిక్కని ఉలెన్‌పాంటు, తెల్ల షర్టువేసి అద్దంలో చూసుకొంటున్నాడు. నేను పక్కమీదనుంచి చూస్తున్నాను

"ఒరే బాబీ నువ్వుకూడా వొస్తే బావుంటుందిరా."

"ఇప్పు డెవడు లేస్తాడు చలిలో. ఐనా అప్పుడే వేషం వేశేశావేం. ఆరుగంటలకిగాని వెళ్లేది!" అన్నాను.

రాజు ఈలవేస్తూ కవాతు చేస్తున్నాడు రూములో. ఇంకా తెల్లారదే అని విసుక్కొంటున్నాడు. మధ్యనోసారి "ఈ నిశిధికి అంతంలేదా" అని గర్జించాడు. అయిదుమాత్రమే కొట్టి ఊరుకున్న గడియారాన్ని నోరారా తిట్టాడు.

ఏమైతేనేం తెల్లవారింది. యూనివర్సిటీ చుట్టూవున్న ప్రకృతి ఇంకా నిద్రపోతోంది. సముద్రం ఎంతో అందంగా, స్నిగ్ధంగా మెరుస్తోంది.

ఆరు కొట్టింది గడియారం.

"ఏం చెప్పను!" అన్నట్టు చూసి 'వెళ్తాను మరి' అన్నాడు రాజు. నాకు ఏం చెప్పాలో తెలియు లేదు. వాడు నవ్వుతూ నడిచాడు.

* * *

పది గంటలకి లైబ్రరీనుంచి వస్తున్నాను ఉషారుగా ఈలవేస్తూ. రాజు పరుగెత్తి వచ్చి "బాబీ గోలిచేశానురా"అంటున్నాడు. దూరాన్నుంచి కొందరు వింతగా చూస్తున్నారు.

"ఏం జరిగిందిరా"

"కృష్ణ వాళ్ళనాన్నదగ్గరకు తీసుకెళ్లింది ఆయన తనకు అరవం తప్ప మరేం రానందుకు విచారిస్తున్నానని ఇంగ్లీషులో చెప్పాడు. బలేవాడులే"

"నువ్వేం చేశావు?"

"నేనూ తగ్గట్టే చేశాను. అరవంలో నే మాట్లాడేను ఆయన చాలా ప్లీజ్ ఐపోయాడు లే. నేను కథలు రాస్తానని చెప్తే .."

"చాలా బాధపడ్డాడు కదూ"

"అబ్బే . కాదు . కృష్ణ నేను టెన్నిస్ ప్లేయర్ అని చెప్పింది ఆయన నేనెంత ఆటగాణ్ణయినా తనని ఓడించలేనన్నాడు వాళ్ళఇంటి ఆవరణలో ఓ టెన్నిస్ కోర్టుంది అక్కడ ఆడాం. గెలుపు నందేలే కాని ఆయన ఓడిపోవాలనే ఓడిపోయినట్టు కనిపిస్తుంది

"అంతేలే. పెద్దవాళ్లు చిన్నవాళ్ళకోసం చాలా త్యాగం చేస్తుంటారు"

"ఏనాలే"

"ఎక్కడికి పోయారు మీరు" అంటున్నాడు కుప్పుస్వామి.

"ఇదంతా కుప్పుస్వామి స్నేహప్రభావం" అంటున్నాడు రాజు. కుప్పుస్వామి ఏమిటో తెలియక నోరు తెరుచుకు చూస్తున్నాడు.

"ఈరోజు మొదలు మనిద్దరికీ నేస్తం. కాఫీ తాగొద్దాం రండి" అని కుప్పుస్వామి భుజంమీద ఆప్యాయంగా చేతులువేసి లాక్కుపోతున్నాడు

నేను అలా నిలబడి చూస్తున్నా "ఏమిటీ స్నేహం!" అనుకుంటూ కుప్పుస్వామి రాజుతో నడవలేక నానాయాతనా పడుతున్నాడు.

"రాజు నన్ను పిలవనేలేదు!" అనుకుని నవ్వుకుంటున్నాను రాజు వెనక్కి తిరిగి "బాబీ! నిలబడిపోయావేం, రా" అని కేకలేశాడు, వెళ్లాను

దూరంగా సముద్రం మహోజ్వలంగా మెరుస్తోంది. సూర్యుడు నడినెత్తిన నిలుచున్నాడు. ముగ్గురం నడిచాం. ★

గ్రీకు వేదాంతి సోక్రటీసు భార్య పరమగయ్యాళి. ఆయన అనుచరు డొకడు ఒకసారి అడిగాడు "నన్ను పెళ్ళి చేసుకోమంటారా?" అని.

"తప్పకుండా చేసుకో. నీ భార్య మంచిదైతే సుఖపడతావు. గయ్యాళిదైతే వేదాంతివౌతావు," అని సోక్రటీసు సమాధాన మిచ్చాడు.



జూపిటర్ వారి "సంతోషం"లో జమున.



నూతనచిత్రం "నాటా"లో అభినేత్రి మధుబాల.



కలు. —(అనుకరణ: వరిక రామలింగేశ్వరరావు)



నర్తకి వహీదా రహమాన్ నృత్యభంగిమ.

* * * *

ఎ. వి. ఎమ్. వారి "నాగులచవితి"లో జమున.



చంద్రముఖి ఇంటికి దేవదాసును తీసుకొచ్చాడు చునీలాల్

బిమల రాయ్ చిత్రం "దేవదాసు"లో వైజయంతీమాల, మోతీలాల్, దిలీప్ కుమార్.

* * *

జూపిటర్ వారి "సంతోషం"లో నృత్యసన్నివేశం.

# 'సత్యం, శివం, సుందరం సర్వదా ధ్యేయం కావాలి'

## చలన చిత్రనిర్మాతలను సత్కరిస్తూ రాష్ట్రపతి హితవచనం

"సత్యం, శివం, సుందరం సర్వదా మీ ధ్యేయం కావాలి. సత్యం, శివం లేనిదే కళ భాసించదు. సౌందర్యం సిద్ధించదు" అని భారత రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ చలన చిత్ర నిర్మాతలకు హితవు చెప్పారు.

ఉత్తమ చలనచిత్రాలు నిర్మించినవారిని సత్కరిస్తూ, వినోదంతోపాటు విజ్ఞానం కూడా అందించగల చలనచిత్రకళ అవధులు ఆబాలగోపాలంపై దానికి ఈనాడుగల ప్రభావం సువిస్తృతమైనది కాబట్టి, చిత్రనిర్మాతలంతా తమ బాధ్యతలుకూడా గురుతరమైనవని గుర్తెరింగి, వాటిని నిర్వహించాలని డాక్టర్ ప్రసాద్ తెలియచెప్పారు. మంచి కథలు తీసుకొని, వాటిని ఉత్తమపంథాలో చిత్రించండి అని ఆయన విజ్ఞప్తిచేశారు.

ఢిల్లీలోని నేషనల్ ఫిజికల్ లేబొరేటరీ మందిరంలో ఈ సత్కారసభ జరిగింది. భారత ప్రధాని శ్రీ నెహ్రూ చలనచిత్ర పరిశ్రమ ప్రముఖులు పలువురు సభకువచ్చారు. కేంద్రసమాచార మంత్రి డా॥ కేస్కర్ స్వాగతం చెప్పారు. అనంతరం డా॥ రాజేంద్రప్రసాద్, ఆయా చిత్రనిర్మాతలకు బహుమతులు ప్రశంసాపత్రాలు ఇచ్చి గౌరవించారు.

అఖిలభారత స్థాయిలో 1954-వ సంవత్సరానికి ఉత్తమ చిత్రంగా పరిగణించబడ్డ మినర్వా మూవిటోన్ వారి 'మీర్జాగాలిబ్' నిర్మాత శ్రీ సోహ్రాబ్ మోడీ రాష్ట్రపతి సువర్ణపతకాన్ని అందుకున్నారు.

ఆయన ఇంకా ఇలా చెప్పారు:

### నిగ్రహం

"సరియైన చిత్రాలు నిర్మించబడాలంటే రెండుమార్గాలు అవలంబించవచ్చును. మొదటిది ప్రభుత్వమే కలుగచేసుకొని నియమ నిబంధనలు పెట్టి ఒక గాడిలో నడిపించడం. ప్రజాస్వామిక వ్యవస్థలో ఈమార్గంకన్న చిత్రనిర్మాతలే ఆత్మవిమర్శనతో, ఆత్మనిగ్రహంతో వ్యవహరించి మంచి చిత్రాలు తీయడం మెరుగు; సబబు. సత్యం, శివం సుందరం, సర్వదా మీ ధ్యేయం కావాలి. సత్యం, శివం లేనిదే సౌందర్యం సిద్ధించదు.

### ముదావహం

"చలనచిత్రాలు వినోదంతోపాటు విజ్ఞానాన్ని అందించే సాధనాలు. ఒకప్పుడు పాతకాలు చెప్పినట్లు బలవంతాన కాకుండా ఒకవంక వినోదం కలిగిస్తూనే మరొకవంక విసుగెత్తించకుండా విద్యను బోధించగలవు.

ఇటువంటి ఉత్తమసాధనాన్ని చలనచిత్రనిర్మాతలు సక్రమంగా, సరియైన విధాన వినియోగించేటట్లు చూడవలసిన బాధ్యత ప్రభుత్వంపై ఉంది. మొత్తానికి ఈనాడు మన దేశంలో తయారవుతున్న చలనచిత్రాల ప్రమాణం నానాటికి ప్రవర్ధమానమవుతూ ఉంది. ఇది ముదావహం.

'మీర్జాగాలిబ్' అనే ఉత్తమచిత్రం నిర్మించినందుకు శ్రీ సోహ్రాబ్ మోడీకి రాష్ట్రపతి పతకం బహూకరిస్తున్నారు.



ఉత్తమ చలనచిత్రాలకు రాష్ట్రపతి డిశంబరు 21 నాడు బహుమానాలు ఇచ్చినప్పుడు-శ్రీ నెహ్రూ, ప్రక్కనున్న పిల్లవాడు శ్రీ సోరాబ్ మోడీ కొడుకు. శ్రీమతి సురైయా, శ్రీమతి మెహతాబ్. శ్రీ సోరాబ్ మోడీ, శ్రీ భారత్ భూషణ్ మొదలైనవారు.

# చలనచిత్ర నిర్మాతలకు రాష్ట్రపతి హితవచనం

"అయితే పిల్లలకు పనికివచ్చే మంచిచిత్రాలేవీ ఇంతవరకూ రాలేదు. ఇదిమాత్రం విచారము కలిగిస్తున్నది. వచ్చే ఏడాదికి ఈ లోపం తీరిపోగలదని ఆశిస్తున్నాను.

1954-లో ఉత్తమచిత్రాలు నిర్మించి, ఈనాడు బహుమతు లందుకొన్న వారినందరినీ అభినందిస్తూ, ప్రభుత్వం చేస్తున్న ఈ సత్కారం చలనచిత్రాలు ఉన్నత ప్రమాణాల నందుకోవడానికి దోహదకారి కాగలదని రాష్ట్రపతి ఆశాభావం వెలిబుచ్చారు.

కేంద్రప్రభుత్వ సమాచార శాఖమంత్రి డా॥ బి. వి. కేస్కర్ స్వాగతం చెబుతూ, ఉత్తమస్థాయికి చెందిన చిత్రాలను గుర్తించి, సత్కరించడంద్వారా, మంచి చిత్రాల నిర్మాణాన్ని ప్రోత్సహించడమే ప్రభుత్వం సంకల్పమనీ, ఆ దృష్టితోనే ఈ బహుమతులను ఏర్పాటు చేశారనీ చెప్పారు

## "డబ్బు రాకపోయినా..."

"కళ, సౌందర్యం ప్రధానంగా ఎంచి, మంచి చిత్రాలను నిర్మించినప్పుడు, వాటికి తగినడబ్బు రాకపోయినా, కనీసం సమాజం గాని, ప్రభుత్వంగాని, ఆ చిత్రనిర్మాతల కృషిని గుర్తించి, ఆ చిత్రం విలువను గ్రహించి గౌరవిస్తే వారు సంతోషిస్తారు. దేశంలో వివిధప్రాంతాలలోని నిర్మాతలతో మంచీ చెడ్డా మాట్లాడినమీదట, వారంతా ఈ అభిప్రాయం కలిగిఉన్నట్లు నేను గ్రహించాను. ఈవిధంగా సత్కరించడం, పరిశ్రమను ఒకవిధంగా ప్రోత్సహించడమే. కాగా, ఏటేటా ఇటువంటి పండుగ ఉండడంవల్ల, ఏయేటికాయేడు ఈ రంగం పురోభివృద్ధికి ఒక కొలమానం ఏర్పాటుచేసుకున్నట్లవుతుంది. ఎటువంటి ప్రమాణాలు అందుకుంటున్నదీ, ఎంత అభివృద్ధి సాధిస్తున్నదీ తెలుస్తుంది" అని డా॥ కేస్కర్ అన్నారు.

## పిల్లల చిత్రాలు

పిల్లల చిత్రాల్ని గురించి ప్రస్తావించి, ఈ ఏడాది ఈ బహుమతి అందుకోడానికి తగిన చిత్రం ఒక్కటి రాకపోవడం శోచనీయమని, అయితే ఈ కొరత తీర్చడానికి ఏర్పడిన పిల్లల చలనచిత్ర సంస్థ కృషి ఫలితంగా, త్వరలోనే మంచిచిత్రాలు నిర్మించబడగలవని ఆశిస్తున్నామని డా॥ కేస్కర్ అన్నారు. ఈ ఏడాది బహుమతు లందుకొన్న నిర్మాతలకు అభినందన లందచేశారు. ఉత్తమచిత్రాలు నిర్ణయించడానికి, శ్రీ దివాకర్ అధ్యక్షతన పనిచేసిన సంఘానికీ శ్రీ దివాకర్‌కూ అభినందన లర్పించారు. ప్రభుత్వం తలపెట్టిన ఈ సన్మాన కార్యక్రమం జయప్రదం కావడానికి చలనచిత్ర పరిశ్రమలోని వారు ఎంతో సహకరించారని ప్రశంసించారు.

భారత ఫిలిం ఫెడరేషన్ అధ్యక్షుడు శ్రీ ఎస్. ఎస్. వాసన్ వందనసమర్పణ చేస్తూ పరిమితమయిన వసతులు, అనేక కష్ట నష్టాలూ, పాత్రిక విమర్శలూ తట్టుకొని, నిలబడగలగడమే కాక, సినీపరిశ్రమ నానాటికీ అభివృద్ధి చెందుతూవున్నదన్నారు. ఇప్పుడు ప్రభుత్వం ఉత్తమ చిత్రాలను మెచ్చుకొని సత్కరించడం ఈపరిశ్రమకు దివ్యౌషధమై జవసత్వాలు చేకూర్చగలదని ఆయన అభిభాషించారు. 

# సినిమా వార్తలు

## అన్నతమ్ముళ్లు

విజయా ఫిలింస్ అనే సంస్థ, ఇటీవల నిర్మించిన "నీతిపతి" అనే తమిళ చిత్రాన్ని 'అన్నతమ్ములు' అనే పేరుతో తెలుగులో నిర్మిస్తున్నారు. ఈ చిత్రానికి, యార్ పయ్యన్ అనే మరొక తమిళ చిత్రానికీ ఇటీవల వాహినీ స్టుడియోలో ప్రారంభోత్సవం జరిగింది.

'అన్నతమ్ములు' చిత్రంలో ఎన్. టి. రామారావు, రేలంగి, మాలతి, జమున, రాజసులోచన నటిస్తున్నారు. దర్శకుడు పి. శ్రీనివాసరావు.

* * *

## భరణీవారి కొత్త చిత్రం

రిపబ్లిక్ పిక్చర్స్ (అమెరికా) వారి "ఫాబ్యులస్ సినోరిటా" ఆధారంగా భరణీ వారు 'వరుడుకావలెను' అనే కొత్త చిత్రం నిర్మిస్తున్నారు. హాస్యరస ప్రధానమైన ఈ చిత్రంలో భానుమతి, జగ్గయ్య, సి. ఎస్. ఆర్, అమర్‌నాథ్, చదలవాడ నటిస్తున్నారు. భరణీ 'చక్రపాణి'కి సంభాషణలు వ్రాసిన రావూరి సత్యనారాయణ దీనికి మాటలూ పాటలూ వ్రాస్తున్నారు. సంగీతం భానుమతి. దర్శకుడు శ్రీరామకృష్ణ.

ఇప్పుడు నిర్మాణంలో ఉన్న భరణీ చిత్రం 'చింతామణి' సగానికి పైగా పూర్తి అయింది. భానుమతి, జమున, ఋష్యేంద్రమణి, ఎన్. టి. రామారావు, ఎస్. వి. రంగారావు, రేలంగి, రఘు రామయ్య, అడ్డాల నారాయణరావు నటిస్తున్న చిత్రానికి దర్శకుడు రామకృష్ణ. కవి రావూరి సత్యనారాయణ. ఈ చిత్రాన్ని మార్చిలో విడుదల చెయ్యాలని కృషిచేస్తున్నారు. ఇది పూర్తి అయ్యేలోగానే వీరి పాతచిత్రం 'రత్నమాల'ను తమిళంలో తీయాలనికూడా సంకల్పించినట్లు తెలుస్తూంది.

* * *

## హఠాత్తుగా హంపికి స్పెషల్ బస్సులు

విజయనగర సామ్రాజ్య శిథిలాల నిలయమైన హంపీపురికి గత నెల మూడో వారంలో హఠాత్తుగా, యాత్రికులు పెరిగారు. హాస్పేటనుండి, ఆ చుట్టుప్రక్కల ప్రాంతాలనుండి స్పెషల్ బస్సులుకూడా వెయ్యవలసి వచ్చింది. అసలు సంగతేమిటంటే, హంపీ శిథిలాల మధ్య తెనాలిరామకృష్ణుడు పచార్లు చేస్తున్నట్లు కబురందింది అందరికీ. డిసెంబరు 14 వ తేదీన విక్రమ్ ప్రొడక్షన్స్ 'తెనాలిరామకృష్ణ' దర్శకుడు శ్రీ. బి. ఎస్. రంగా, తెనాలి రామునినీ (నాగేశ్వరరావు) రామకృష్ణుడి భార్యను (జమున) హంపి తీసుకువెళ్లారు. పరవళ్లు తొక్కే తుంగభద్రానదీ మతల్లిని తెనాలి రాముడు వర్ణించే సన్నివేశాన్ని, కథకు సంబంధించిన మరికొన్ని ముఖ్య ఘట్టాలనూ అక్కడ చిత్రించారు. ఈ సంగతి తెలిసి, జనం హంపికి తరలివెళ్లి తమ అభిమాన నటులను చూచారు. నాగేశ్వరరావు, జమున, తమను చూడవచ్చిన వారందరితోనూ కలసి కట్టుగా మాట్లాడి, వారడిగిన ప్రశ్నలకు జవాబులు చెప్పారు. 17 వ తేదీన తిరిగి మద్రాసు వచ్చారు.

ఈ చిత్రంలో శ్రీకృష్ణదేవరాయలుగా ఎన్. టి. రామారావు, కృష్ణసానిగా భానుమతి, తిమ్మరుసుగా నాగయ్య, తాతాచార్యులుగా ముక్కామల నటిస్తున్నారు. చిత్రం పూర్తి కావడానికి ఇంకొక్క నృత్యం చిత్రించడం తరువాయి. జనవరి విడుదల కాగలదని తెలుస్తూంది.

## జూపిటర్ 'నయాఆద్మీ'

జూపిటర్స్ పేరిట ఎం. సోమసుందరం నిర్మిస్తున్న రెండవ నెంబరుచిత్రం (ఇంకా పేరు పెట్టలేగు) సగానికిపైగా పూర్తి అయింది. నల్లతంగాళ్ అనే తమిళ చిత్రం ఆధారంగా తయారవుతున్న ఈ చిత్రంలో ఎన్. టి. రామారావు, రేలంగి, నాగయ్య, వంగర, పేకేటి, కన్నాంబ, శ్రీరంజని, బాలసరస్వతి నటిస్తున్నారు. కవి సదాశివబ్రహ్మం. సంగీతం అశ్వత్థామ. కళ కె. ఆర్. శర్మ. లంక సత్యం దర్శకత్వం వహిస్తున్నారు. పర్యవేక్షణ పి. పుల్లయ్య. ఈ చిత్రం ఫిబ్రవరి నెలాఖరుకు పూర్తిచేస్తారని తెలుస్తోంది. జూపిటర్ వారి మరొక తమిళచిత్రం "వేలైక్కారి" ఆధారంగా నిర్మించిన తెలుగు చిత్రం "సంతోషం" విడుదల అయింది. ఎన్. టి. రామారావు, జగ్గయ్య, రామశర్మ, నాగేంద్రరావు, చదలవాడ, అంజలి, జమున, రాజసులోచన నటించారు. ఈ కథనే వీరు "నయాఆద్మీ" అనే పేరుతో హిందీలోకూడా నిర్మిస్తున్నారు. ఇందులో నటీనటులంతా "సంతోషం"లో ఉన్న వారే. ఎటొచ్చీ విలన్ భూమికను అన్వర్ హుసేన్ నటిస్తున్నాడు. హాస్యనటుడు గోప్ కూడా ఉన్నాడు. అన్వర్ హుసేన్ కాలుజారి పడి కొద్దిగా దెబ్బతిన్నందువల్ల, "నయాఆద్మీ" నిర్మాణం మరో రెండుమూడు మాసాల లోగా పూర్తి కాకపోవచ్చు ననుకుంటున్నారు.

## వాహినీవారి 'భాగ్యరేఖ'

శ్రీ బి. యన్. రెడ్డి దర్శకత్వాన వాహినీ పేరిట పొన్నలూరి బ్రదర్స్ నిర్మిస్తున్న "భాగ్యరేఖ" షూటింగ్ జనవరి ఆరంభంలో మొదలు పెడతారు. దర్శకుడు శ్రీ బి. యన్. రెడ్డి ఈచిత్రానికి జమున, ఎన్. టి. రామారావు రేలంగి, పి. యన్. ఆర్. లను తీసుకున్నారు. మిగతా వారిని త్వరలోనే నిర్ణయిస్తారు. ఇప్పటికి ఆరుపాటలకు రికార్డింగ్ పూర్తి అయింది. కవి శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి. సంగీతం పెండ్యాల నాగేశ్వరరావు.

* * *

## 'సౌభాగ్యవతి'

నందీ పిక్చర్స్‌వారి చిత్రం "సౌభాగ్యవతి"కి ఈ నెల 8-వ తేదీన వాహినీలో ప్రారంభోత్సవం జరిగింది. వాహినికి చెందిన శ్రీ రాధాకృష్ణన్ కెమేరా స్విచ్ ఆన్ చేశారు. ఎన్. టి. రామారావు, సావిత్రి, రేలంగి, సూర్యకాంతం, హేమలత నటిస్తున్నారు. నిర్మాత కె. యం. నాగన్న.

* * *

## త్రీహెడెడ్ కోబ్రా

ఫిలింస్థాన్ వారి మొట్టమొదటి టెక్ని కలర్ సినిమాస్కోప్ చిత్రం 'త్రీహెడెడ్ కోబ్రా' నిర్మాణం దాదాపు పూర్తిఅయినట్లే. అశోకుమార్, ప్రేమనాథ్, సూర్య కుమారి, వినీతాబట్, అమెరికన్ నటులు అలెక్స్ డి ఆర్సీ, జాన్ లోడర్‌లు ఇందులో నటించారు. సినిమా స్కోప్, ఆంగ్ల చిత్రంలో నటించిన మొట్టమొదటి దక్షిణ భారత తార సూర్యకుమారి.

ఫిలింస్థాన్ అధిపతి తులారాం జలాన్, ఈ చిత్రాన్ని విదేశాలలో విడుదల చేయడానికి ఏర్పాట్లు చేసుకునే నిమిత్తం మొన్న లండన్ వెళ్లారు.

## అగ్రజుడి అడుగుజాడల్లో...

కిస్మత్‌లో సాటిలేని మేటి జేబుదొంగగా నటించి పేరందుకున్న అశోక్ కుమార్ అడుగుజాడల్లో, ఇప్పుడు అతని తమ్ముడు కిషోర్ కుమార్ బయల్దేరాడు. ఎ. వి. ఎం. చిత్రంభాయ్‌భాయ్‌లో కిశోర్ ఈ కళని బాగా సాధకం చేస్తున్నాడు. వీధిన ర్తకి రాణి (నిమ్మీ) నాలుగు డబ్బులకోసం నాట్యం చేస్తూ ఉంటే, ఇతగాడు నాలుగు రాళ్ళకోసం, ఆ అవకాశాన్ని సద్వినియోగం చేసుకుని, నాట్యం చేస్తూన్న రాణిని చూస్తున్న ప్రేక్షకుల జేబులు కత్తిరిస్తూ కాలక్షేపం చేస్తూవుంటాడు. ఎం. వి. రామన్ దర్శకత్వాన ఎ. వి. ఎం. లో తయారవుతున్న ఈచిత్రంలో అశోక్ కుమార్, నిమ్మీ, నిరూపరాయ్, కిశోర్ కుమార్, నిగార్ సుల్తానా, డేవిడ్, ఓంప్రకాశ్ ప్రభృతులు నటిస్తున్నారు. మాటలు పాటలు రాజేంద్ర కృష్ణ. సంగీతం మదన్ మోహన్.

# బొంబాయి సినిమా లేఖ

భారతటాకీ రజతోత్సవాలు వచ్చే మార్చిలో భారీ ఎత్తున జరపడానికి ఫిలిం ఫెడరేషన్ ప్రభృతి సంస్థలన్నీ సన్నాహాలు చేస్తున్నాయి. ప్రధాన ఉత్సవ కార్యక్రమం ఢిల్లీలో ఇప్పుడు భారత ప్రారిశ్రామిక ప్రదర్శనం జరుగుతున్న మైదానంలోనే ఏర్పాటు కావచ్చు. దీంతో పాటు బొంబాయి, మద్రాసు, కలకత్తాలతో ఆయా ప్రాంతాల వారు ఉత్సవాలు చేస్తారు. ఈ రజతోత్సవంలో ప్రత్యేకాకర్షణ చలన చిత్ర నిర్మాణ విధానాన్ని విపులంగా ప్రదర్శించడం. దీనికి కావలసిన సరంజామా రూపవత్తూ ప్రదర్శన శాలల్లో అమరుస్తారు. తారలు వచ్చి నటిస్తారు. ఇదికాక, ప్రత్యేకం ఒక గ్యాలరీలో చలన చిత్ర పరిశ్రమకు సంబంధించిన వివిధ భాగాలన్నీ ప్రదర్శించే ఏర్పాటు విషయం కూడా ఆలోచిస్తున్నారు. కాగా ఈ పరిశ్రమపై గోష్ఠి. నటీనటుల వినోద కార్యక్రమాలు ఏర్పాటు చేస్తారు. ఈ ఉత్సవం పురస్కరించుకుని ప్రత్యేకం ఒక పుస్తకం ప్రచురిస్తారు.

*   *   *

సింహళ చలన చిత్ర నిర్మాతలలో ప్రముఖుడైన సర్ చిత్తంపాలెం గార్డినర్ మొన్న బొంబాయి వచ్చినప్పుడు 1957 లో సింహళంలో ఒక చలన చిత్రోత్సవం జరుగుతుందని చెప్పారు. 1957 ఫిబ్రవరి 16 నుండి మార్చి 16 వరకు జరిగే ఈ ఉత్సవం కొలంబో పథకం పేరిట నిర్వహించబడుతుంది. దీనికి అన్ని దేశాల వారినీ ఆహ్వానించడం జరుగుతుంది. పాల్గొనే దేశాలలో భారతదేశం చాలా ప్రముఖంగా ఉంటుందని సర్ చిత్తంపాలెం చెప్పారు.

*   *   *

గత వారం ఇక్కడ రెండు పెద్ద చిత్రాలు విడుదల అయ్యాయి. అశోక్ కుమార్, మీనాకుమారి, బిపిన్ గుప్త, ప్రతిమాదాగాన్స్ నటించిన 'బందీష్' చక్కని కథ. ఈ చిత్రంలో బాల నటుడు రూప్‌కుమార్ చాలా ముచ్చటగా నటించాడు. చిత్రం ఆసాంతం హాస్యరసపూరిత సన్నివేశాలతో చురుకుగా సాగింది. చాలా రోజులకు ఒక బెంగాలీ దర్శకుడు సత్యేన్‌బోస్ ఈరూపేణా తిరిగి ఒక హాస్యరస ప్రధాన చిత్రాన్ని తీశారు. బసు చిత్ర మందిర్ నిర్మించిన ఈ చిత్రానికి హేమంతకుమార్ సంగీతం ప్రత్యేకాకర్షణ.

*   *   *

ఫిలింఇండియా కార్పొరేషన్ షాహిద్ లతీఫ్ దర్శకత్వాన నిర్మించిన "సొసైటీ" (సమాజం), జంకూ గొంకూ లేకుండా, సంఘానికి పెద్దమనుషులైన వారి దుష్కృత్యాలను లోకానికి వెల్లడిచేయ బూనుకున్న ఒక పత్రికా రచయిత కథను చిత్రిస్తుంది. నసీర్ ఖాన్, నిమ్మి ముఖ్య భూమికలు నిర్వహించారు. కథ కొన్ని చోట్ల చాలా మందకొడిగా సాగింది. కొన్ని సన్నివేశాలు కృత్రిమంగా కనిపిస్తాయి. శచీన్ దేవ బర్మన్ సంగీతం మాత్రం ప్రశంసనీయంగా ఉంది. మినూముంతాజ్ అనే కొత్త నర్తకిని ఈ చిత్రంలో ప్రవేశపెట్టారు

*   *   *

పరిణీతా, దోభీఘాజమీన్ లవంటి ఉత్తమ చిత్రాలు నిర్మించిన బిమల్ రాయ్, ఇప్పుడు 'దేవదాస్' నిర్మాణం చురుకుగా సాగిస్తున్నారు. బహు కొద్దిసన్ని వేశాలు మాత్రమే తిరనాయి దిలీప్, సుచిత్రాసేన్, వైజయంతిమాల, మోతీలాల్, నజీర్ హుసేన్ ప్రతిమాదేవి, బేబినాజ్, రామ్‌కుమార్, నానాపల్సీకర్, కన్హయలాల్, మురాద్, ఇఫ్తికర్, శివరాజ్ ప్రభృతులు నటిస్తున్నారు. మాటలు రాజేంద్రసింగ్ బేడీ. పాటలు సాహిర్ లూధియానవీ. సంగీతం శచిన్‌దేవ బర్మన్, కెమెరా కమల్ బోస్. త్వరలోనే ఈ చిత్రాన్ని విడుదలచేయడానికి బిమల్ రాయ్ గట్టిగా కృషి చేస్తున్నారు.

*   *   *

ఎం షెట్ ప్రొడక్షన్స్ చిత్రం 'జల్తీ నిషానీ'లో గీతాబాలి, షమ్మీకపూర్ చిలకా గోరువంకలు. కులదీప్ కౌర్, చమనపురి, రాజ్మెహ్రా, ఉల్హాస్. ఇతర భూమికలు నిర్వహిస్తున్నారు. దర్శకుడు హరీష్. సంగీతం అనిల్ బిశ్వాస్ కెమెరామన్ ఎ. జి. ధానిక్ ఈయనే దీని నిర్మాత కూడాను.

కన్నడ నవల 'హంసగీతె' ఆధారంగా విశ్వభారతి ఫిలింస్ భారీఎత్తున నిర్మిస్తున్న "బసంత్ బహార్"లో నిమ్మి, భరత్ భూషణ్‌లు ప్రధానభూమికలు నిర్వహిస్తున్నారు లీలా చిట్నిస్, ఓం ప్రకాష్, చంద్రశేఖర్, మనోమోహనకృష్ణ, కుంకుం, ఎస్. కె. ప్రేమ్, మొదలగు వారు ఇతర ముఖ్యపాత్రలు నిర్వహిస్తున్నారు టిప్పుసుల్తాన్ ఉజ్వలంగా వెలిగిన కాలంలో జరిగినట్లు చిత్రించే ఈకథకు సంభాషణలు రాజేంద్రసింగ్ బేడీ వ్రాశారు. పాటలు శైలేంద్ర సంగీతం శంకర్, జైకిషన్.

*   *   *

పుష్ప పిక్చర్ పేరిట ఎ. ఎ. నాడియావాలా నిర్మిస్తున్న తొలిచిత్రం 'ఇన్‌స్పెక్టర్'కు మొన్న ఎం.టి. స్టూడియోలో ముహూరాత్ జరిగింది.



"ఏకాదశి" హిందీచిత్రంలో త్రిలోక్ కపూర్, మాలాసిన్హా.



నంది పిక్చర్సవారి తెలుగుచిత్రం "సౌభాగ్యవతి" గతమాసంలో వాహినీస్టూడియోలో ప్రారంభింపబడింది

## 1955 లో మొత్తం 24 తెలుగు చిత్రాలు

జనవరి విజయావారి 'మిస్సమ్మ' రాగిణీవారి 'అర్ధాంగి'

ఫిబ్రవరి యూనియన్ పిక్చర్స 'శ్రీ జగన్నాథ మాహాత్మ్యం' నీలా ప్రొడక్షన్స 'అతను యవరు'

మార్చి వాహినీవారి 'బంగారు పాప', ప్రతిభావారి 'రేచుక్క'

ఏప్రిల్, రోహిణీవారి 'బీదల ఆస్తి', సారథీవారి 'రోజులు మారాయి', అంజలీవారి 'అనార్కలి'.

మే వి ఎస్ పి వారి 'ఆడ బిడ్డ', గోకుల్ వారి 'వదినగారి గాజులు'

జూన్ ప్రకాశ్ వారి 'అంతే కావాలి', కృష్ణా పిక్చర్స 'విజయ గౌరి'

జులై భాస్కర్ ప్రొడక్షన్స 'చెరపకురా చెడేవు', విరల్ ప్రొడక్షన్సవారి 'కన్యాదానం'

ఆగస్టు సాధనావారి 'సంతానం', అరుణావారి 'అంతా ఇంతే', వినోదావారి 'కన్యాశుల్కం'

సెప్టెంబరు . 'పతియే ప్రత్యక్ష దైవం'

అక్టోబరు అన్నపూర్ణా వారి 'దొంగరాముడు', నేషనల్ ఆర్ట్ వారి 'జయసింహ'

నవంబరు శ్రీ రాజరాజేశ్వరీ వారి 'శ్రీ కృష్ణ తులాభారం'

డిసెంబరు శ్రీ అండ్ ప్రమోదా వారి 'పసుపు కుంకుమ', జూపిటర్ వారి 'సంతోషం'.

సినిమా విలన్ ప్రాణ్ మొదటి షాట్ కు క్లాపర్ బాయ్‌గా పనిచేశాడు అశోక్ కుమార్, గీతాబాలి, కె ఎన్ సింగ్, అచల సచ్‌దేవ్, నజీర్ హుసేన్, ప్రతిమా దేవి, ప్రాణ్ మొదలైన వారు నటిస్తున్న ఈ చిత్రానికి శక్తిసమంతా దర్శకుడు సంగీతం హేమంతకుమార్

* * *

సంగీత దర్శకుడు నౌషద్ తీస్తున్న 'మాలిక్' ఎస్ ఎం యూసఫ్ దర్శకత్వాన చురుకుగా సాగుతోంది సురయా, తలత్ మహమూద్, జీవన్, ప్రాణ్ నటిస్తున్నారు సంగీతం గులాం మహమ్మద్ నౌషద్ నిర్మించనున్న తరువాతి చిత్రం 'పాల్కీ'లో భరత్ భూషణ్, నిమ్మి, రంజనా శుక్లా నటిస్తారు దీనికి నౌషద్ సంగీతం సమకూరుస్తారు ఎస్ యు సన్నీ దర్శకత్వం నిర్వహిస్తారు.

* * *

పెద్దకథ

వాసమూర్తి

(గత సంచిక తరువాయి)

## ఏడో అధ్యాయం

కమల పెళ్ళి అన్నగారింట్లో అతి సామాన్యంగా జరిగింది. రాజారావు ఉభయ ఖర్చులూ భరిస్తానన్నాడు. కాని అలా చేస్తే తన గౌరవానికి లోపమని గోపాలం కమల ఇచ్చిన ఏభై, మరొకరి దగ్గర తెచ్చిన నాలుగువందలూ పెట్టి పెళ్ళి సూక్ష్మంగా జరిపించాడు. రాజారావు స్నేహితులను గాని, బంధువులనుగాని తీసుకు రాలేదు. ఇరువైపులకీ కావలసినవారు అతి ముఖ్యమైన కొద్దిమంది బంధువులు మాత్రం వచ్చారు. మిగిలిన బంధువుల నందరినీ రాజారావు తన యింట గృహప్రవేశానికి పిలిచాడు. ఊళ్ళోవాళ్ళు కూడా అట్టే మంది రాలేదు—ఒకరిద్దరు ప్రక్కయిళ్ళవారూ, గోపాలం వ్యాపార స్నేహితులూ తప్ప. కమల స్నేహితురాళ్లు కొందరు వచ్చారు. కొందరికి అదే ముహూర్తాన పెళ్లిళ్లు జరగబోతున్నాయి. శుభప్రదమయిన పెళ్ళి వాతావరణంలో కమల ఒక్కతే దిగులుగా ఉంది. ఎన్ని విధాల సమర్థించుకున్నా లోపల ఒక విధమైన బెంగా భయమూ పీకుతూనే ఉన్నాయి. తన ఆశయాలకి తిలోదకాలిచ్చినట్లే! తన చేతులతోనే తన కంఠానికి ఉరిపోసుకుంటున్నానేమో నని కలవరపడుతోంది. గుండెదడతో పెళ్ళి ముహూర్తం ఎదురుచూస్తూ కూర్చుంది.

కమలను తీసుకవెళ్లి వరుడికెదుట కూర్చోబెట్టారు. కొద్దిసేపటికి తెర అడ్డుతీసివేశారు. కమల వెంటనే సాహసించలేకపోయింది రాజారావుని చూడడానికి. మెల్లగా చూచింది. రాజారావు ఆమెవైపే చూస్తూ కనిపించీ కనపించని చిరునవ్వు నవ్వుకున్నాడు. కమల మరొకమారు చూసింది. ఈ మారుకొంచెం దీర్ఘంగా.

ఇతనేనా రాజారావు! ఇతనంటేనా తనంతగా భయపడింది? రాజారావు పక్కపాపడి, కుడివైపున కంటిమీదకు పడుతున్న ఉబ్బుజుట్టూ, విశాలమైన నుదురూ, పొడుగూ, పొట్టిగాని ముక్కూ, కొద్దిగా లావైన పెదవులూ, జాలికళ్ళూ చూసి ఆమెకాశ్చర్యం పెరిగిపోయింది. ఈ మనిషేనా దుర్మార్గుడని చెప్పుకునేది. కాని ఈ మొగం చూస్తే దుర్మార్గాన్ని గురించి ఆలోచించడానికి అవకాశమే లేనట్లుంది. పురోహితుడు చెప్పిన మంత్రాలు రాజారావు ఉచ్చరిస్తూంటే చల్లని పిల్లవాయువు సోకినట్లుంది. ఈ మనిషిలో లోకం చెప్పుకునేటంత దుర్మార్గంఉండి ఉండదనుకుంది కమల. ఒకవేళ ఇతనిలో ఏ దుర్మార్గం ఉన్నా తాను సులభంగా దారిలో పెట్టగలననే ధైర్యం కలిగిందామెకు. నిజంగా తా నదృష్టవంతురాలి నే అనుకుంది. అన్నగారూ వదినగారూ సరియైన ఆలోచనే చేశారు. అందుకే పెద్దవారి అనుభవమంటే అంత విలువ ఇస్తుంది లోకం! మేళతాళాల ఘోషలో రాజారావామె బుజాలపైగా చేతులు పోనిచ్చి మెడలో పుస్తెకడుతూంటే అంత చదువుకున్న కమల, ఉద్యోగంచేస్తూ సంఘంలో స్వతంత్రంగా బ్రతుకనేర్చిన కమల కూడా సిగ్గుకు లోనుకాకుండా ఉండలేకపోయింది. గోపాలం సూర్యకాంతం అది గమనించే ఉన్నారు. ఒకరి మొగాలొకరు చూసుకొని సంతృప్తిలో నవ్వుకున్నారు. పెళ్ళి అయిపోయింది.

తరువాత అమలాపురం వెళ్లారందరూ. గృహప్రవేశోత్సవం చాలా పెద్ద ఎత్తున జరిగింది. విందులూ, పార్టీలూ, మేళాలూ, పాటకచ్చేరీలు ఒకటేమిటి చుట్టాలకూ, ఊళ్లోవారికీ కూడా ఎడతెరపి లేని కార్యక్రమం. కమలకీమూడు రోజులూ క్షణం విశ్రాంతి లభించలేదు. చుట్టాలెవ్వరూ చుట్టుముట్టి మాట్లాడించడానికి ప్రయత్నిస్తూండేవారు. పెళ్ళికూతురితో మాట్లాడ్డం ఒక గౌరవం వాళ్ల దృష్టిలో. ఆ మూడు రోజులూ మూడు నిమిషాల్లా గడిచిపోయాయి. ఇంటికి తిరిగి వచ్చాక ఏకటాకీ పన్నెండు గంటలు నిద్రపోయింది కమల.

మరునటి రోజు మంచిదని తెలుసుకొని తమకున్న గదులలో కొత్తదైన గదిని శోభన గృహంగా మార్చారు గోపాలం దంపతులు. ఇరుగు పొరుగుల నడిగి మంచి అద్దాలూ, పటాలూ అవీ తెచ్చి గోడలకు పెట్టారు. పాన్పు తయారు చేశారు. పందిరికి మల్లెపూదండలు వ్రేలాడ కట్టారు. అగరువత్తుల ధూమంతో గది నిండిపోయేటట్లు చేశారు. సూర్యకాంతం పెద్ద ఎత్తుకు పోకుండా ఇరుగు పొరుగు ముత్తైదువులను నలుగురైదుగురిని మాత్రమే పిలిచింది. పాటలుపాడి భార్యాభర్తలచేత తమలపాకుల చిలకలు కొరికించి, గంధం పూయించి వచ్చినవారికి తాంబూలాలిచ్చి పంపించింది. కమల కీ పూర్వపుటాచారాలలో అంత నమ్మకం లేకపోయినా వదినగారు చెప్పినట్లే నడుచుకుంది. కమల నివతలకు తీసుకొని వచ్చి కొద్దిసేపున్న పిమ్మట లోపలికి పంపి వెనకాల తలుపు వేసింది సూర్యకాంతం. కలగబోయే కొత్త అనుభవం తలచుకుంటే కమలకాక్షణం ఏదో విచిత్రమైన బెదురూ, సిగ్గూ ఆవరించాయి. తలవంచుకొని గుమ్మం దగ్గరే నిలబడింది. పందిరిమంచంమీద రాజేంద్రభోగిలా పడుకొని రాజారావు ప్రక్క కొరిగి కమలకేసి చూశాడు. కొంతసేపు చూసి చూసి మెల్లగా లేచి ఆమె వైపుకు వచ్చాడు. సుగంధపరిమళం దట్టమై మత్తెక్కించేటట్లుంది. కమల తలవంచుకునే ఓరగా చూస్తోంది. రాజారావు దగ్గరకు వచ్చి తన చేయి ఆమె సన్నని నడుము చుట్టూ పోనిచ్చి తీసుకువెళ్ళి మంచంమీద కూర్చోబెట్టాడు. ఆమె చేయి తన చేతుల్లోకి తీసుకున్నాడు. మల్లెపూదండ తీసి ఆమె జడలో ముడిచాడు. ఆమె తలమీద రాస్తూ మెల్లగా హాయిగా 'కమలా' అన్నాడు. కమల మాట్లాడలేదు. "నేనంటే



# అబల



నీ కిష్టమేనా కమలా" అన్నాడు అనురాగ భరిత కంఠంతో. కమల చిరునవ్వు నవ్వి ఊరుకుంది. "నీవు చదువుకున్నదానివి. నేనంత చదివినవాడిని కాను. నేను నీకు తగుతానా, కమలా. నేనంటే నీ విష్టపడ గలవా" అన్నాడు ఆమెను దగ్గరకు లాగుకొని.

మూడు రోజుల తరువాత రాజారావు అమలాపురం వెళ్ళిపోయాడు. వెళ్లిపోయేటప్పుడు కమల హృదయంలో కొత్తరకం బాధ కలుగజేసి వెళ్ళిపోయాడు. కమల కిప్పుడు ఏమీ తోచడం లేదు. పుస్తకాలాసక్తితో చదువలేక పోతోంది. ఇంటిపనులలో ఏమీ ఉత్సాహం చూపలేక పోతోంది. వదినగారు కూడా "నీ విప్పుడు ధనవంతురాలవమ్మా. నీవు పని చేయడమేమిటి" అని ఆమె నే పనీ ముట్టనీయడం లేదు. కమలకు కావలసినంత తీరిక. భావి జీవితంగురించి బంగారు కలలు కంటూ కాలం గడిపి వేస్తోంది. ఆమెకు పరధ్యానం ఎక్కువైపోయింది. దగ్గర బుచ్చి కూర్చొని తన పుస్తకంమీద సిరాబుడ్డిలోని సిరా నంతా వంచేసి వా నవ్వుతూ చూస్తూ కూర్చుంది. ఈపరధ్యానం ఎంతవరకూ వెళ్లిందంటే ఆఖరికి ఒకనాడు ఎవరో మనిషి లోపలికి వస్తున్నట్లు చూసి కూడా కదలకుండా కూర్చుంది. చివరికి ఆ వచ్చిన మనిషి రాజారావు అని గ్రహించి ఒక్క ఉరుకులో లోపలికి పరుగెత్తింది.

రాజారావు భార్యను కాపురానికి తీసుకు వెళ్ళడానికి వచ్చాడు. గోపాలం పెద్ద సారలేమీ పెట్టలేకపోయాడు. చెల్లెలికొక సిల్కుచీరా, రవిక గుడ్డా మాత్రం కొని భార్యచేత కమల కిప్పించి "అమ్మాయి ఇది వరకు నీవు బీదవాడి చెల్లెలివి. ఇప్పుడో ధనవంతుడి భార్యవి. నీకిలాంటివి లెక్క కాదు. కాని ఇదే నేను పెట్టగలిగింది. దీనితో సంతోషపడి మమ్మల్ని సంతోష పెట్టమ్మా" అన్నాడు. కమల కంట తడి పెట్టకుండా ఉండలేక పోయింది. ప్రయాణ సన్నాహం మవుతుండగా వదినగారు కమలను చాటుకు పిలిచి "కమలమ్మా ఎప్పుడో వీలు కలుగ జేసుకొని మీ ఆయనతో ఒకసారి చెప్పు మీ అన్నయ్య వ్యాపారం సంగతి. మేము కూడా చెపుతాంలే వెంటనే చెపితే బాగుండదని ఊరుకున్నాం" అంది. కమల తెల్లబోయి వెంటనే విషయం జ్ఞప్తికి తెచ్చుకొని "నే నెలా చెప్పగలను వదినా. నేను చెపితే బాగుంటుందా" అంది తనమీద భారం వేయవద్దని ప్రార్థిస్తున్నట్లుగా చూస్తూ. సూర్యకాంతం మొగం మీద ఒక తెరపడి తొలగింది. "అవునమ్మా, నీవు చెప్పడం బాగుండదులే, మేమే చెపుతాములే. కాని రాజారావు నీతో ఈ విషయం ప్రస్తావిస్తే తగినట్లు ప్రోత్సాహం చేయమ్మా" అంది చివరికి. ఇంతలో బయటి నుంచి గోపాలం "లాంచి వేళవుతోంది" అని కేక వేయడంవల్ల ఇద్దరూ ఇవతలికివచ్చారు. కమల అన్నగారి పాదాలకూ, వదినగారి పాదాలకూ నమస్కరించి, పిల్లలను ముద్దాడి, కళ్ళు తుడుచుకుంటూపోయి బండెక్కింది. గోపాలం రేవువరకూ వచ్చి లాంచి బయలుదేరేవరకూ కూడా ఉండి వెళ్ళిపోయాడు.

రాజారావూ కమలా ఇంటికి వెళ్ళగానే ఇరుగు పొరుగిళ్ళ స్త్రీలు హడావుడిగా పరుగెత్తి వచ్చి ఇద్దరికీ హారతిపట్టి దిష్టితీశారు. కొంతసేపు కమలతో మాట్లాడి వెళ్ళిపోయారు. రాజారావు వంటమనిషినీ, పని మనుషుల్నీ పిలిచి కమలకు అందరినీ పరిచయం చేశాడు వాళ్లు చేతులు కట్టుకొని నమస్కారం చేశారు. తరువాత కొంతసేపటికి రాజారావు ఊళ్లో పనుండి వెళ్లిపోయాడు. సాయంత్రంవచ్చి భోజనంచేసి కమల కూడా భోజనం చేసినతరువాత ఆమెను పిలిచి ఆమె చేతికి ఒక వంకీ తగిలించాడు. కమల చూసుకుంది. విలువైన రాళ్ళతో పొదగబడి చక్కని డిజైనుతో చాలా అందంగా ఉంది. కమల దానికేసి ఆశ్చర్యంగా చూస్తూ ఉండిపోగా రాజారావు నవ్వుతూ 'మరి నాకు బహుమతో' అని దగ్గరకు లాక్కున్నాడామెను.

మర్నాడు కమల ఇల్లంతా తిరిగిచూసింది. మొత్తం పదహారు గదులున్నాయి చిన్నవీ పెద్దవీ కలిపి. గదులనిండా భోషాణాలూ, పెట్టెలూ, అద్దాలూ, పటాలూ వగైరాలున్నాయి. ఇన్ని గదులు తమ కవసరమే లేదు. అయినా అంత ఇల్లు చూసుకొని గర్వం పొందింది. ఇంట్లో కాలక్షేపానికి రేడియోకూడా ఉంది. ఇంటికి చుట్టూ పెద్ద దొడ్డి దొడ్డినిండా పూలమొక్కలు అరణ్యంగా పెరిగిఉన్నాయి. ఇంటినీ తోటనీ కొత్తతీరులో పెట్టాలి అనుకుంది. ఈ ఊరిలో తన పుస్తకాలూ, రేడియో తప్ప తన కితర కాలక్షేపం ఎలా? చుట్టుపక్కల స్త్రీలతో పరిచయం చేసుకోవాలి. ముఖ్యంగా చదువుకున్నవారి స్నేహం చేయాలి. తనకు తెలిసినవారెవరైనా ఆ ఊళ్ళో ఉన్నారేమోనని ఆలోచించింది. కొంతసేపటికి జ్ఞాపకం వచ్చింది జానకి పిన తల్లి ఆ ఊళ్లోనే ఉందనీ, ఆమె ప్లీడరు భార్య అనీ. ఆవిడ ఎప్పుడైనా అమలాపురం రావడం పడితే తప్పకుండా తన ఇంటికివచ్చి వెళ్ళమని మరీ మరీ చెప్పింది. ఆవిడ చదువుకున్నదే. ఆవిడద్వారా చదువుకున్న ఇతర స్త్రీలను కలుసుకోవచ్చు. ఎప్పుడో ఆవిడ ఇల్లెక్కడో తెలుసుకొని వెళ్ళిరావాలనుకుంది. అంతవరకూ రేడియోతోనూ పుస్తకాలతోనూ కాలక్షేపం చేయడానికి స్థిరపడింది కమల.

ఆవేళ కమల పుస్తకం చూస్తూ యాదాలాపంగా వంటమనిషిని పిలిచి రాత్రికి వంటలేంచేయాలో చెపుదామనుకొని వంటింట్లోకి వెళ్ళింది. వంటమనిషి అప్పుడే దొడ్లోకి పోబోతోంది. "ఇదుగో" అని కేక వేసింది కమల. ఆ మనిషి ఉలిక్కిపడి గిర్రున తిరిగి తెల్లబోతూ నిలబడింది. ఆమె ఒడి బరువుగా ఉన్నట్లుంది. కాని కమల దృష్టి మొదట్లో ఆమె ఒడిమీద పడనేలేదు. "ఇలా రావమ్మా" అని పిలిచింది మామూలుగానే. వంటమనిషి ముందుకు కదలకుండా అక్కడే నిలబడిపోయింది వణికిపోతూ. కమల కాశ్చర్యం వేసింది ఎందుకీ మనిషి ఇలా భయపడుతుందని ఆమె దృష్టి ఆ మనిషి ఒడిమీద పడింది "ఏమిటది" అంది కమల వంటమనిషి జవాబీయలేదు కమలకు కుతూహలం పెరిగింది. "ఏమిటది"

అని దగ్గరకు పోయింది వంటమనిషి "ఏమీ లేదమ్మా, ఎందుకూ పిలిచారు? తరువాత వస్తానమ్మా. ఇప్పుడు పనుంది" అంటూ కంగారుగా వెళ్ళిపోబోయింది. కమల కనుమానం కలిగింది "ఆగు ఒడిలో ఏముందో చెప్పమంటే చెప్పవేం?" అని అడిగింది. "వంటమనిషి ఒడి కడ్డంగా చేయి పెట్టుకొని నిలబడింది కమల తీక్ష్ణంగా అడిగింది: "ఒడిలో ఏముందో చూపిస్తావా లేకపోతే వారిని పిలిపించమంటావా" అని. వంటమనిషి కాళ్ళబేరానికి వచ్చింది. ఆమె చేతులుపట్టుకొని ఏడుస్తూ "ఈసారికి వదిలి వేయండమ్మా బాబుగారితో చెప్పకండి. ఇంకెప్పుడూ చెయ్యను" అని బ్రతిమాలింది కమల కప్పు డవగాహన అయింది ఇంట్లో స్థితి "సరే ఈ సారికి వదిలి వేస్తున్నాను. ఇక ముందునుంచి జాగ్రత్తగా ఉండు" అంది పనివాళ్ళను కూడా పిలిచి "జాగ్రత్తగా పని చేయండి నేనిక కనిపెట్టిచూస్తాను ఏమైనా హెచ్చుతగ్గులు కనిపించాయా ఊరకోను" అంది వాళ్ళు హడలిపోయి దణ్ణాలు పెడతూ "జాగ్రత్తగా నేఉంటామమ్మ గారూ" అన్నారు కమల వాళ్ళనూరికే కూర్చోపెట్టేకన్నా పని అప్పజెప్పితే మంచిదని కొందరిచేత గదులు శుభ్రం చేయించి, గదుల్లో ఉన్న భోషాణాలు పెట్టెలూ వగైరాలన్నీ ఒక మూల గదిలోకి చేర్పించి, మిగిలిన గదులన్నిటినీ ఖాళీగా ఉంచి, కొన్నిటిలో తన ఇష్టప్రకారం ఏర్పాట్లుచేయించింది కొందరికి దొడ్లో ఎత్తుగా పెరిగిఉన్న గడ్డి కోసి వేసి తోట శుభ్రపరచే పని అప్పజెప్పింది వాళ్ళు ఆమె చెప్పినట్లుగానే ఉరకలు వేస్తూ చేస్తున్నారు

మర్నాడు ప్రొద్దున్న ఎవరో ఆరుగురు వనవ్యలు 'రాజారావూ, రాజారావూ' అని బిగ్గరగా కేకలు వేస్తూ తమలో తాము మాట్లాడుకుంటూ బిగ్గరగా నవ్వుతూ లోపలికి వచ్చారు కమల తెర వెనుకనుంచి చూసింది వాళ్ళు "ఏరా, రాజారావు, త్వరగా రారా, మీ యింటికి వచ్చి అప్పుడే కొన్ని రోజులైంది. రారా సరదాగా గడుపుదాం" అని కేక వేసి వీధి వైపు వరండాలోనే తివాచీమీద చతికిలబడ్డారు. "ఇదిగో వస్తున్నాను" అంటూ రాజారావు తయారవుతున్నాడు. కమల వంటమనిషిని పిలిచి "ఎవరువాళ్ళు" అని అడిగింది. "బాబుగారి స్నేహితులమ్మా పేకాటకొచ్చారు కాబోలు. మరిబాబు గారికి రోజు వెళ్ళడ మెలా అమ్మా" అంది ఆమనిషి. "పేకాట సమాజమా! డబ్బెట్టే ఆడుతారా?" అని అడిగింది కమల "ఆ, డబ్బెట్టే నమ్మా వాళ్ళు అసలు వచ్చేదే దాని కోసమమ్మా" అని చెప్పిందామె. తన కప్పుడే పరీక్ష ప్రారంభం కానున్నదనుకుంది కమల రాజారావు నిజంగా కనుపించినంత అమాయకుడు కాడన్నమాట. జనం చెప్పుకునే దానిలో కొంత నిజం లేకపోలేదన్న మాట. ఈ వేళ ఈ రూపం బయటపడింది. ముందు ఇంకా ఏమి బయట పడతాయో! కమలనిశ్చయించుకుంది ఈ సమస్య నెగుర్కొని తీరాలని.

పేకాటకు కూర్చున్నా రందరూ ఆట ప్రారంభమైంది. బుర్రమీసాల వాడొకడు, పిలకా పంగనామాలతో సిల్కు చొక్కా తొడుగుకొని సన్నగాఉన్న వాడొకడు, చూస్తేనే రౌడీలా ఉన్న వాడొకడూ, మరి కొందరూ ఉన్నారు అందరూ కిళ్ళీలు నములుతూ మధ్య మధ్య లేచివెళ్ళి వీధిలో ఊసివస్తున్నారు బుర్రమీసాల పెద్దమనిషి ముక్కలుపంచుతూ ఒకమారు లోపలివైపుకు చూసి 'బలే చిలకను తెచ్చావుట కద్రా, రాజారావు; అందరూ చెప్పుకుంటున్నారు. నేను చూడనే లేదు గృహప్రవేశానికి ఊళ్లో లేనుకాదూ' అన్నాడు నవ్వుతూ. రాజారావు మాట్లాడలేదు ఆటలో మునిగి ఉన్నాడు. పంగనామాలాయన "ఒరే రాజారావ్! చదువులు నేర్చిన చిలకరోయి! పంజరంలో ఉండదేమో జాగ్రత్త అనక నె తీనోరూ బాదుకున్నా లాభం లేదు" అన్నాడు అందరూ పకున నవ్వారు కమలకు ఒళ్లు మండిపోయింది వీళ్లు మనుషులా పశువులా అని తనను గురించి ఇంత హేయంగా మాట్లాడుతారా తనను గురించి వాళ్లలాంటి మాటలంటున్నా భర్త ఏమీ పట్టించుకోవడం లేదే. వాళ్లు ఇంకా ఏవేవో మాట్లాడుకుంటూ నవ్వుకుంటూ ఆడుతున్నారు కమలకు కొరడా తీసుకువెళ్ళి ఒక్కొక్కళ్ళని తరిమికొట్టా లనిపించింది. కాని ఏం చేయగలదు? వాళ్ళ మాటలూ నవ్వులూ వినలేక తన గదిలోకి పోయి, తలుపులు వేసకొని పుస్తకం తీసుకుంది. కాని వాళ్ళన్న మాటలు జ్ఞాపకం వస్తూనే ఉన్నాయి. భర్తతో చెప్పి వీళ్ళను మళ్ళీ ఆ గడప తొక్కకుండా చేయాలనుకుంది అవతల వాళ్ళ ఆట కంతు లేనట్లుంది వంటమనిషి కాఫీ ఫలహారాలు తయారు చేసింది రాజారావు నౌకరుని కాఫీ ఫలహారాలు తీసుకు రమ్మన్నాడు నౌకరు పట్టుకెళ్లి అందిచ్చాడు. వాళ్లవి సేవిస్తూనే పేకాడుతూనే ఉన్నారు. ఎన్ని గంటలాడుతారో! వాళ్లకు విసుగనేది పుట్టదు కాబోలు! అనుకుంది కమల. సాయంత్రం అయింది కాని ఆట కాలేదు. కమలకు జ్ఞాపకం వచ్చింది జానకి పినతల్లి మాట. అప్పుడే వెళ్లి కలుసుకుంటే బాగుంటుందనిపించింది భర్తకు చెపుదామని నౌకరుతో "అయ్యగారి నొకమారు లోపలికి పిలుచుకురా" అని చెప్పింది. వాడు వెళ్లి రాజారావుతో చెప్పాడు "ఎందుకు" అని అడిగాడు రాజారావు "ఏమోనండి రమ్మంటున్నారు" అన్నాడు వాడు. ఆట జోరుగా ఉంది అప్పుడు. రాజారావు లేవ బుద్ధి



"అమ్మా చూడవే. అన్నయ్య నన్ను పందీ అని తిడుతున్నాడు," అని ఫిర్యాదు చేసింది చిన్నపిల్ల.

"తప్పు కాదురా వెధవా! చెల్లాయిని పందీ అనచ్చా?" అని కోప్పడింది అమ్మ.

"అయితే పందిని చెల్లాయీ అనచ్చా?" అని అబ్బాయి అడిగాడు.

"అనుకో. నాకేం?" అని గర్వంగా సమాధానమిచ్చింది చిన్నపిల్ల.

అబ్బాయి ఆమెకేసి తిరిగి "చెల్లాయీ!" అని పిలిచాడు

తేయాక "ఇప్పుడు తీరు లేదని చెప్పు" అన్నాడు. కమలకు చాలా కోపం వచ్చింది. చాలా బాధవేసింది కూడా. అయినా తన ప్రయాణం మానుకోవటమెందుకని వంట మనిషిని పిలిచి "నేనలా ఊళ్ళోకి వెళ్ళి వస్తాను బాబుగారితో చెప్పు నేను వచ్చే వేళకు వంటచేసి ఉంచు" అని చెప్పి జానకి పినతల్లి పేరూ, ఆమె భర్తపేరూ చెప్పి, వాళ్ళ ఇల్లు ఎక్కడుందో తెలుసుకొని నౌకరుచేత జట్కాను పిలిపించి ప్రక్క గది లోంచి వీధిలోకి వెళ్ళి ఎక్కింది.

జానకి పినతల్లి కమలను చూసి ఎదరకు పరుగెత్తి వచ్చి ఎంతో ఆనందంతో లోప లికి తీసుకువెళ్ళింది "నీవు కూడా ఈ ఊరి కొచ్చిలివే అయ్యావు. నాకెంతో సంతో షంగా ఉందమ్మా. ఈ ఊళ్ళో తగిన స్నేహి తులే లేరు. ఒక్క కాలక్షేపం లేదు. ఎప్పుడో ఏ సినిమాలో తప్ప. చదువుకున్న వాళ్ళం కొందరమున్నాం కాని ఒకరినొకరు కలుసుకోవటం చాలా అరుదు. ఎవరిళ్ళలో వాళ్ళం కూపస్థ మండూకాల్లా ఉంటాము. చదువుకున్నదానివి నీవు ఒకతెవి దొరి కావు కాబట్టి నాకు ప్రాణం లేచి వచ్చినట్ల యింది" అంది ఆవిడ. కమల అడిగింది. "ఈ ఊళ్ళో మహిళాసంఘమేమీ లేదా అండి" అని. "ఇంకా లేదమ్మ నీవు వచ్చావు కాబట్టి ఆ ప్రయత్నమేదో చేదాం నలు గురికి మంచి కాలక్షేపమూ ఉంటుంది దాని ద్వారా ఏమైనా మంచి పనులు చేయవచ్చు కూడా" అంది ఆవిడ కమల కావిడ సూచన బాగా నచ్చింది. ఇద్దరూ మహిళా సంఘం విషయమూ, ఊళ్ళో విశేషాలను గురించి చాలాసేపు మాట్లాడుకున్నారు సమయ మెలా ఎగిరిపోయిందో వారికి తెలియలేదు ఆఖరికి "మీరొకమారు మా యింటికి కూడా రావాల'ని చెప్పి సెలవు తీసుకొని ఇంటికి వచ్చివేసింది.

కమల ప్రక్క వాకిలినుంచి లోపలికి వచ్చిన వెంటనే రాజారావు "ఇప్పుడే వస్తాను ఉండు" అని ఆట ఆపుచేసి లోప లికి వచ్చాడు. "ఎక్కడికి వెళ్ళావు" అని అడిగాడు కమలని.

"నాకు తెలిసిన ఆవిడ ఒకరుంటే ఆవిడ ఇంటికి వెళ్ళానండి" అని చెప్పింది కమల.

"ఎవరావిడ. ఆవిడ భర్త పేరేమిటి? ఆయన ఏంచేస్తున్నాడు?"

"భర్త పేరు సూర్యనారాయణరావు గారట ప్లీడరుగారట"

"సూర్యనారాయణరావుగారా? వెళ్ళే ముందు నాతో ఎందుకు చెప్పలేదు?"

"చెపుదామనే నౌకరుచేత పిలిపించాను గదూ. మీరు రాలేదు."

"ఇకముందు నాతో చెప్పకుండా ఎక్కడికీ వెళ్ళకు. ముఖ్యంగా సూర్యనారా యణరావుగారింటికి అసలు వెళ్ళకు తెలి సిందా" అన్నాడు రాజారావు కనుబొమలు ముడుచుకొని.

"ఏం ఎందుకు వెళ్ళకూడదు ఆవిడ చాలా మంచిదండీ మా స్నేహితురాలి పినతల్లి. ఇంతకుముందు రాజమండ్రీ వచ్చినప్పుడు తన ఇంటికి రమ్మని ఎన్నోసార్లు చెప్పింది. అందుచేత వెళ్ళాను" అంది కమల.

"నా కెదురు చెప్పకు. నేను వెళ్ళకూడ దన్నాను అంతే వెళ్ళకూడదు. ఎదురు ప్రశ్న వేయకు" అని రాజారావు త్వరగా వెళ్ళిపోయాడు.

కమలకు రోషం వచ్చింది ఏమిటీ శాసనం! "వెళ్ళకూడదు" ఏమిటి? ఎందుకు వెళ్ళకూడదో ఎందుకు చెప్పకూడదు? తనే మీ తెలియనిది కాదే తనకు కారణం చెప్ప వచ్చే. ఊరికే ఏమీ చెప్పకుండా వెళ్ళకూడ దంటే! కమల కోపంతో చరచరా తనగది లోకి నడచి కుర్చీలో కూలబడింది. మళ్ళీ ఆలోచించింది రాజారావును తను సరిగ్గా అర్థం చేసుకోలేకపోయింది ఇదివరకు. అతి నెమ్మదంటి వాడని ప్రతీతి కలదో అదే నిజమవుతోంది క్రమక్రమంగా. ఎలాగైనా పట్టుదలతో భర్తను దారిలో పెట్టాలనుకుంది. బెజవాడ వెళ్ళేముందు వదినగారి పెత్తనం కింద ఉండటంవల్ల ఆమెకు పిరికితనం ఎక్కు వగా ఉండేది స్నేహితులతో తప్ప పలికే వారితో ఎవరితోనూ స్వేచ్ఛగా మాట్లాడలేక పోయేది వాదనకు తప్పుకుని తిరిగేది కాని బెజవాడ వెళ్ళిన తరువాత రఘు పరిచయం ద్వారానూ, స్వతంత్రజీవనంమూలానా ఆమెకు సంపూర్ణ ఆత్మవిశ్వాస మేర్పడింది. వాదించగలననే ధైర్యం వచ్చింది తన గౌరవం నిలుపుకోవాలనే పట్టుదలకూడా పెరిగింది. భర్త నిరంకుశాజ్ఞ ఆమెలో పట్టు దలను మరింత పెంచింది భర్తను మార్చాలి తనపని తేలికకాదు. ఎంతో ఓర్పుతో నేర్పుతో పనికి పూనుకోవాలి అనుకుంది.

వెళ్ళి వంటమనిషి నడిగింది "వంటఅయిం దా?" అని "ఆ అయిందమ్మ బాబుగారు భోజనం చేసేశారు. ఇక మీరే తరవాయి" అంది వంటమనిషి సుబ్బమ్మ "బాబుగా రప్పుడే భోజనం చేసేశారా? ఎప్పుడు?" అని అడిగింది కమల. "మీరు వెళ్ళిన కొద్ది సేటికే లోపలికి వచ్చారమ్మ మీ రేరీ అని అడిగారు. అలా ఊళ్ళోకి వెళ్ళారని చెప్పాను వంట అయిందా అని అడిగారు అయిందన్నాను అంతే వెంటనే వచ్చి భోజనం చేసి వెళ్ళిపోయారమ్మ" అని చెప్పింది సుబ్బమ్మ "మరి వాళ్ళు" అంది కమల. "వాళ్ళకు టిండీతిప్పలూ ఏమిటమ్మా కాఫీ టిఫిన్లుంటేచాలు ఎంతరాత్రయినా ఆడు తారు" అంది సుబ్బమ్మ "సరే నేనూ భోజ నము చేస్తా"నని భోజనంచేసి తన గదిలోకి పోయి భర్తకోసం ఎదురుచూస్తూకూర్చుంది కమల భర్తతో ఒకసారి మెల్లగా మాట్లాడి కారణం తెలుసుకోవాలని కాని ఎంత రాత్రికీ రాజారావు రానే లేదు కమల కెప్పుడో నిద్రపట్టేసింది ఎప్పుడొచ్చాడో లోపలికి కమల లేచి చూడగా రాజారావు పడుకొని ఉన్నాడు.

కొంత పొద్దెక్కిన తరువాత రాజారావు లేచాడు. స్నానం చేసి బట్టలు వేసు కున్నాడు కమల తనే టిఫిన్ పట్టుకువెళ్తా నని చెప్పి వంటమనిషిదగ్గరనుంచి ప్లేటు తీసుకువెళ్ళి భర్తముందు పెట్టింది రాజా రావు ఒకమారు కమలకేసి చూసి చిరునవ్వు నవ్వి "ఏం రాణిగారు తీసుకువచ్చారే ఈ వేళ!" అని ఫలహారం తీసుకోసాగాడు

"నిన్న నేను ఆ ప్లీడరుగారి భార్యదగ్గ రకు వెళ్ళి వచ్చినందుకు కోపపడ్డారే వెళ్ళ కూడదన్నారే ఎందుకు వెళ్ళకూడదో నేను తెలుసుకోకూడదా? తెలుసుకుంటే తప్పే ముందండీ" అని అడిగింది కమల ఎంతో సౌమ్యంగా

"తెలుసుకోడాని కేమీ లేదు నేను వెళ్ళ వద్దన్నాను. అంతే వెళ్ళకూడదు.

ఇంటి యజమానురాలు వంటలక్కను పిలిచి ఇలా చెప్పింది: "రేపు మా అత్త గారు వస్తోంది. ఆవిడకి అన్నింట్లోనూ కారం చాలా తక్కువగా ఉండాలి. వంకాయకూర అంటే చెవి కోసుకుంటుంది మజ్జిగలో మీగడ తొరకలు ఉండరాదు. పులుసులో ఉల్లిపాయలు పనికిరావు."

"అలాగేనమ్మా. ఆవిడకెలా ఇష్టమో అలాచేస్తాను," అన్నదివంటలక్క వినయంగా.

"అలా చెయ్యవద్దని చెప్పటానికే నేను పనిగట్టుకుని వచ్చాను," అని గదమాయించింది యజమానురాలు.

"శాసనమా ?"

"అవును శాసనమే. శాసనాన్ని శిరసా వహించాలి. ధిక్కరించకూడదు. ప్రశ్నించ కూడదు. నేనుకూడా చదువుకున్న వాళ్ళలాగే మాట్లాడుతున్నాను కాదూ" అని నవ్వాడు రాజారావు. "నీకు కాలక్షేపం కాకపోతే ఇరుగు పొరుగు అమ్మలక్కలు కావలసినంతమంది ఉన్నారు. వాళ్ళను పిలిచి కాస్త కబుర్లలోకి దింపావంటే నీకు కాలక్షేపానికి లోటు ఉండదు" అని వంటమనిషిని కేకవేసి "సుబ్బమ్మ ఈవిడగారు ఒకసారి తీరిక వేళ రమ్మని చెప్పిందని ఇరుగు పొరుగిళ్ళ వాళ్ళతో చెప్పు" అన్నాడు రాజారావు. "అలాగే చెపుతాను, బాబుగారూ" అని వెళ్ళిపోయింది వంటమనిషి. కమల ఈ విషయం ఇప్పుడింతకన్నా ప్రస్తావిస్తే లాభం లేదని, తగిన సమయం రాగానే తిరిగి ఎత్తాలని, ముందు పేకాట విషయం అడగాలని అనుకొని అడిగింది. "ఏమండీ, ఆ పేకాటలాడే వాళ్ళెవరు? వాళ్ళనెలా రానిస్తున్నారుమీరు? వాళ్ళనుమాస్తేనే అసహ్యం వేస్తోంది" అని.

"అసహ్యం వేస్తోందా? అయితే వాళ్ళను చూడకు. అసలు ఎవరు చూడమన్నారు వాళ్ళను. అయినా వాళ్ళకేం?"

"వాళ్ళు ఉత్తనీచులలా కనిపిస్తున్నారు. వాళ్ళతోనా మీ స్నేహం?"

"ఏం. ఎందుకు స్నేహం చేయకూడదు. ఏం చదువుకొని ఉద్యోగాలు చేసేవాళ్ళేనా స్నేహం చేయతగ్గవాళ్ళు? మిగతా వాళ్ళు స్నేహితులుగా ఉండడానికి తగరా?"

"నామాట విని వాళ్ళతో స్నేహం చేయకండి. వాళ్ళస్నేహంవల్ల మీకుకలిగే ప్రయోజన మేమీ లేదు. వారి భాష విన్నారా?"

"వాళ్ళు నాకు పాతికేళ్ళనుంచి స్నేహితులు. చిన్నప్పుడు కోతికొమ్మచ్చి, గోటీబిళ్ళలాడిననాటినుంచీ స్నేహితులు ఈనాడు రాణిగా రాజ్యాపించారని పాతికేళ్ళ స్నేహితుల్ని వదులుకోవలసిందేనా? వాళ్ళమాటలు మోటుగా ఉంటాయనికాదూ నీకసహ్యం. కాని అందుకే వాళ్ళంటే నా కిష్టం. వాళ్ళున్నది ఉన్నట్లు చెపుతారు. లోపల ఒకటి పైన ఒకటి ఉండదు వాళ్ళకి. మాట మోటుగా ఉండవచ్చును కాని దాపరికం లేనిది. కాని మీ పెద్దమనిషి స్నేహితులు పైకి తియ్యగా మాట్లాడుతారు. వెనుకనుంచి గొయ్యి తవ్వుతారు. ఎదురుగా గట్టిగా తిట్టలేరుకాని చల్లగా కొంపలు కొల్లగొట్టేస్తారు. పైగా మీ పెద్దమనిషి స్నేహితుల స్నేహంమాటవరకే ఉంటుంది చేతులకొచ్చేటప్పటికి ఎవరికివారే యమునాతీరే. కాని మా స్నేహితులు అవసరమొస్తే ప్రాణం ఇవ్వడానికైనా సిద్ధపడతారు తెలుసా?"

"అదంతా మీడబ్బు చూసే నేమో!"

"డబ్బుచూసే కావచ్చు. ఈ లోకంలో ప్రతివాడూ ఏదో ఒకటి చూసే చేస్తాడు. కాని ఊరికే చేయడుగదా. నిష్కామంగా చేసేవాడు వైరాగ్యే ఏ కొండలమీదకో, ఏ అరణ్యాల్లోకోపోయి తపస్సు చేస్తాడు కాని మనమధ్య ఉండడు. అలాంటప్పుడు డబ్బుచూసి చేస్తే తప్పా? డబ్బు లేనివాడికి స్నేహితు లేమిటి ? పైగా నా స్నేహితులందరూ నా డబ్బుకోసమే వచ్చారనుకోవట మేమిటి? అందులో కొందరికి ఏభైఏసి ఎకరాల బంగారు మాగాణిఉంది తెలుసా?"

"మీ మాటలకు మీ రిప్పుడు తృప్తి పడుతున్నారుకాని సమయం వచ్చినతరువాత తప్పక తెలుసుకుంటారు వారెటువంటి స్నేహితులైనదీ, వారిస్నేహ మెంత నిలకడయైనదీని. అప్పుడనుభవంమీద తెలుసుకునేకన్న ముందే ఆలోచించి తెలుసుకొని జాగ్రత్తపడడం మంచిది కాదూ? వాళ్ళ మాటలు వింటూంటేనే అసహ్యం కలగడం లేదూ? వాళ్ళలా స్వేచ్ఛగా మాట్లాడుతూంటే ఎలా సహించగలుగుతున్నారు మీరు?"

"ఏం. ఏమన్నారు? చిలక అన్నారు నిన్ను. అంతేకాదూ. అందులో తప్పేముంది? నీవునిజంగానే చిలకలా ఉన్నావు కాదనగల వారెవరు? పైగా మాలో మాకు దాపరికమూ రహస్యమూ అంటూ లేదు. వాళ్ళు నా విషయంలో ఎంత చనువుగా మాట్లాడుతారో నేనూ వాళ్ళవిషయంలో అంతే చనువుగా మాట్లాడుతాను తెలుసా మాదో స్త్రీ అంత గాఢమైంది అయినా వాళ్ళమాటలు మొదట్లో కొంత బాధ కలిగిస్తాయి కాని క్రమంగా అలవాటైపోయి ఆపైన బాధ కలిగించవు"

"వారూ మీరూ ఒకటేనా? మీ భోగ్యులు నాకు సంబంధించినంతగా వారికి సంబంధిస్తాయా. మీతో కష్టంవస్తే కష్టం, సుఖంవస్తే సుఖం సమానంగా పంచుకోవలసిన నామాటా, ఈనాడు మీ డబ్బుచూసి మునిగేవాళ్ళమాటా సమానమే అంటారా? నామాట వినండి. వాళ్ళ స్నేహం వదిలివేయండి. పేకాట మానివేయండి. వాళ్ళు ఇలాంటి అలవాట్లే చేస్తారు" అంది కమల ఉద్వేగంతో.

"పేకాట ఎందుకు మానాలి?" అని అడిగాడు రాజారావు తేలికగా నవ్వుతూనే.

"పేకాట దుర్వ్యసనమని మీకు తెలియదూ ?"

"దుర్వ్యసనమా ? ఏదో పెద్దమాట వాడావే. కాని ఇలాంటి మాటలకు నేను భయపడనులే. చెడ్డదనేకాదూ నీ అభిప్రాయం. ఎందుకు చెడ్డదో చెపుతావా ?"

"పొందే ఆనందంకన్న, పోయే నష్టం ఎక్కువ కాబట్టి. పేకాటవల్ల, ధనమూ, కాలమూ కూడా పోతాయి ఎంతమంది జమీందార్లు బికార్లు కాలేదు ఈ పేకాటలవంటి వాటిమూలాన?"

"ఓహో అదా నీ బెంగ. నా డబ్బుకు నేనే బెంగపెట్టుకోవడం లేనిదే మధ్య నీకెందుకు ఆదుర్దా. ఇంతకీ ఖర్చుపెట్టడానికే కాదూ డబ్బూ. అటువంటప్పుడు నా ఆనందంకోసం ఖర్చుపెట్టుకోవడం తప్పా? డబ్బు నాకోసం కాని డబ్బుకోసం నేను కాదుగా" అని నవ్వాడు రాజారావు తన తర్కానికి తానే సంతోషిస్తూ.

అప్పటికి రాజారావు స్నేహితులు వీధి వరండాలోకి వచ్చిచేరారు. "రావోయి జమీందారు! ఆటవేద్దాం" అంటూ కేకలు వేస్తున్నారు. కాఫీ కప్పులో పోసుకొని త్రాగి వెళ్ళడానికి లేచాడు. కమల చటుక్కున పరుగెత్తి గుమ్మానికి కడ్డంగా చేతులు చాపి నిలబడింది. "ఏమిటిది?" అన్నాడు రాజారావు ఆశ్చర్యంతో "కాసేపుంటే వాళ్ళే వెళ్ళిపోతారులెండి మీరటు వెళ్ళకండి. నేనంటే మీ కిష్టం లేదూ? నామీద ప్రేమ ఉంటే, నేను మీకు కావలసినదాననైతే వెళ్ళకండి" అంది ప్రార్థనాపూర్వకంగా కమల.

రాజారావు నవ్వి "నీవంటే నా కెంత ఇష్టమో చెప్పాలా? కాని ఇప్పుడు నన్నడ్డుపెట్టకు. పదేళ్ళనుంచీ ఉన్న అలవాటు నీవీ క్షణంలో పోగొట్టలేవు. వ్యర్థ ప్రయత్నం చేయకు అవతల పాపం వాళ్ళు కనిపెట్టుకు కూర్చున్నారు. వాళ్ళ ఆనందం చెడగొట్టడం దేనికి" అని ఆమె బుగ్గమీద చిటికవేసి, రెండు చేతులతో ఆమెను మెల్లగా పట్టుకొని పక్కకు తొలగించి వెళ్ళిపోయాడు.

(ఇంకా వుంది)




# స్త్రీ ధనము



ఇల్లిందల సరస్వతీదేవి

“స్త్రీ సొమ్ము కూతుళ్ళకే చెందాలి. నగలు స్త్రీ ధనము క్రింద లెక్క గనుక ఆడ పిల్లలకే చెందుతాయి. అమ్మ నగలలో అన్నదమ్ములకు భాగము లేదు” అని కుమార్తెలు అనటము మనము సాధారణముగా వింటూనే ఉంటాము.

ఈ స్త్రీ ధనమనగా ఏమిటి? స్వయముగా ఆర్జించని స్త్రీలకు ధన మెక్కడిది? స్త్రీ ధనమని దేనిని పేర్కొంటారు? ఈ అంశాలను తెలిసికొనటానికి క్రీస్తు పూర్వము 4 వ శతాబ్దములో కౌటిల్యుని కాలము వరకూ మనము వెళ్ళవలసి ఉంటుంది. కౌటిల్యుడు అర్థ శాస్త్రము వ్రాశాడు గనుక స్త్రీ ధనమును గురించి పేర్కొన్న వారిలో ప్రథముడు.

బాల్యములో తండ్రీ, యౌవనములో భర్తా, వార్ధక్యములో కుమారుడూ స్త్రీకి రక్షకులుగా ఏర్పడినప్పుడు ఆమెకు తనది అనే సొత్తు ఎక్కడినుంచి వస్తుంది? గృహపాలకురాలు అన్నా గృహానికి యజమానురాలు అన్నా, పురుషుడి అర్ధాంగి అన్నా మరిసి సంపత్తి చెందవలసిన అధికారాలే గాని సంపాద్యాధికారాలు కాలేక పోయినవి. కౌటిల్యుని కాలములో స్త్రీకి పురుష సంతానము కలగటమే ప్రధానాంశముగా-జీవిత పరమావధిగా సంఘము భావించేది. యౌవనవతి అయిన వితంతువు పునర్వివాహము చేసుకొనటానికి ఈ కారణము చేతనే కౌటిల్యుని ధర్మ శాస్త్రము అనుమతించింది. భర్తలచే పరిత్యజించ బడ్డ భార్యలు కూడా పునర్వివాహము చేసుకొనటానికి ధర్మ శాస్త్రము ఒప్పింది. వివాహాలు సులభముగా జరగటానికి తగిన మార్గాలు ఏర్పడ్డాయి. ఆ కాలములో వివాహాలు కుల రూప గుణ యౌవనముల చేత గాని ప్రేమ చేతగాని జరిగిన నాటికంటె, శుల్కము మీదనే ఆధారపడి జరిగినవి అధిక సంఖ్యలో ఉండేవి. వివాహ కాలమందు వధువు తలి దండ్రులకు వరుడు చెల్లించేది శుల్కము. వివాహాలు శుల్క ప్రధానముగా పరిగణించబడేవి.

భార్య కేవలము విషయ సుఖాల కొరకు వివాహము చేసుకొన్నది కాదు. ఆమె ధర్మ పత్ని. గృహిణి చేతిలో ఆముష్మిక సుఖ సాధనమైన కర్తవ్య కాండ అంతా ఉండేది. సత్కర్మ లన్నిటికీ ఫలమైన స్వర్గము కూడా “దారాధీన స్తథా స్వర్గః” గా భార్యాధీనమై ఉండేది. సంఘములో ఆమెకు విశిష్టమైన స్థానము ఉండేది. కాని ‘ఇది నాది’ అని చెప్పుకో తగిన ఆస్తి ఉండేది కాదు.

కౌటిల్యుడు ఈ పరిస్థితులను గమనించి స్త్రీకి తనదంటూ సొత్తు ఏర్పడటానికి కొన్ని మార్గాలను అన్వేషించాడు. స్త్రీ ధనానికి ప్రత్యేకించి కొన్ని నియమాలేర్పరచాడు. ఈ విధముగా ప్రత్యేకించబడిన స్త్రీ ధనానికి వారసులను కూడా ప్రత్యేకించాడు.

స్త్రీ ధనము మూడు విధములైనది. మొదటి రకము ఆభరణాలు, రెండవ రకము ఆహితధనము, మూడవది శుల్కము అని వివరముగా నిర్ణయించబడ్డది. మొదటి రకమైన ఆభరణాల రూపమున ఉన్న సొత్తు స్త్రీకి వివాహకాలమందు గాని అంతకు పూర్వము గాని తలిదండ్రులు ఇచ్చిన కానుకలూ, వరుడు యిచ్చిన అలంకారాలు. రెండవ విధమైన ఆహితధనము ద్వితీయ వివాహము చేసుకొనబోవు భర్త ప్రథమ భార్యకు చెల్లించిన ధనము. మూడవది వివాహకాలమందు వధువు తలిదండ్రులకు వరుడు చెల్లిం



పక్క పేజీ బొమ్మలోని డిజైనుకు ఎన్‌లార్జిమెంట్లు.



# చోళీ డిజైన్

చోళీకి ఈ డిజైను వేసుకోవాలంటే, గుడ్డ కత్తిరించిన వెంటనే కుట్టడం కన్నా, చోళీ కుట్టించిన తరువాతే కుట్టడం మంచిది. డిజైను అంచుని అంటిపెట్టుకు ఉంటుంది కాబట్టి ఫ్రేములో బిగించినప్పుడు పిగిలి పోయే ప్రమాదం ఉంది అంచుకని, కుట్టించిన తరువాత, అప్పుడైనా అతిజాగ్రతగా తగుమాత్రంగా గుడ్డని బిగించాలి.

మరీ లేత, మరీ అంత ముదరా కాని నీలి రంగు చోళీకి ఈ డిజైను వేస్తే, చేతిమీద పువ్వులో నిలువు గీతలు ఉన్న భాగం అంతా కనకాంబరం రంగుదారం (నెం 445) తో ముద్ద కుట్టు వేసి నింపాలి. చివరికి మధ్యలో చక్రంలా ఖాళీ ఏర్పడుతుంది. దీని మధ్యలో చోళీ గుడ్డకి ఒకటి రెండు పోగులు తీసేసి, ఆ చిల్లుచుట్టూ కాజా కుట్టు కుటాలి. చుక్క చుక్కలుగా ఉన్న రేఖలు రెండూ విత్తనాల కుట్టు. దీనికి నెం 700 ఎర్రదారం వాడితే బాగుంటుంది ఈడిజైనులో అడుగున ఉన్న దీపకళిక మినహా మిగతా వంకీ గీతలన్నీ ఆకుపచ్చ రంగు దారంతో కాడ కుట్టు వేసుకుంటూ పోవాలి. దీపకళిక, దాని క్రింద వున్న చిన్న సున్నా లేత ఆకుపచ్చ దారంతో ముద్ద కుట్టు వేసి నింపాలి.

మెడపట్టీ డిజైనుకు ఈ క్రింది దారాలు బాగా నప్పుతాయి

పై వరస గుడి గోపురాలలా ఉన్నవన్నీ (నిలువు గీతలతో నిండినవి) ముదర ఆకు పచ్చ దారంతో ముద్ద కుటు వేసి నింపాలి. వాటికి దిగువన ఉన్న గోపురాలు ఎర్ర దారంతో గొలుసుకుట్టు వేసి నింపితే బాగుంటుంది. పై రెండిటికీ మధ్య ఉన్న గీతలు కనకాంబరం దారంతో కాడ కుట్టు కుట్టుకోవాలి గోపురాలకు మధ్య ఉన్న ఢమురుకాలవంటి వాటికి లేత కనకాంబరం దారంతో కాడ కుట్టు వేసుకోవాలి.

దిగువ వరసలో నిలువు గీతలతో నిండిన వంకీ డిజైను అంతా ముదర ఆకుపచ్చతో ముద్ద కుట్టు వేసుకు పోవాలి. దానికి ఎడా పెడా ఉన్న సన్నటి గీతలకు కనకాంబరంతో కాడ కుట్టు బాగుంటుంది. త్రిభుజాలన్నిటికీ ముద్ద కుట్టు వేసుకోవాలి. దీనికి లేత ఆకుపచ్చ దారం దక్కగా ఉంటుంది పోతే సున్నాలన్నిటిలోను అద్దాలు కుట్టుకోవచ్చు దీనికి ఎర్రదారం బాగుంటుంది

తెల్ల రంగు చోళీ అయితే ఇవన్నీ లేకుండా ఈ మెడ పట్టీ, చేతిమీద పువ్వు డిజైను అంతా లేత ఆకుపచ్చ దారంతో కుట్టుకున్నా బాగుంటుంది. లేకపోతే, మెడ పట్టీకి పూర్తిగా ఆకుపచ్చ దారం, చేతిమీద పువ్వు డిజైనుకి పూర్తిగా ఎర్రదారం ఉపయోగించుకోవచ్చు. 

# ★ స్త్రీ ధనము ★

(43 వ పేజీ తరువాయి)

చిన శుల్కము. ఇది అంతా స్త్రీ ధనమే. ఈ ధనము పైన స్త్రీకి దాన విక్రయాది సంపూర్ణాధికారాలు ఉన్నాయి.

పెనిమిటి జీవించి ఉన్నప్పటికీ చనిపోయిన భార్యయొక్క స్త్రీ ధనము పైన అతడికి ఏవిధమైన అధికారమూ లేదు. ఆమె సంతానము, స్త్రీ పురుష తారతమ్యము లేకుండా పంచుకోవచ్చును. కుమారులు లేని పక్షమున కుమార్తెలు పంచుకోవలసి ఉంటుంది. కుమార్తెలు కూడా లేనట్లయిన చనిపోయిన స్త్రీ యొక్క ధనాన్ని ఆమెకు తాను యిచ్చినంతవరకు భర్త తీసుకొనవచ్చును. ఆమె బంధువులు, ఆమెకు ఏ రూపముగా బహుకరించినవారు ఆరూపముగా అంతవరకూ తీసుకొనవచ్చునని ధర్మశాస్త్రములో చెప్పబడినది. ధర్మశాస్త్రములో నిర్వచింపబడిన ఆస్తికి ఏవైపునా వారసులు లేనట్లయితే, దానిని రాజులు స్వాధీనపరచుకోవచ్చునని నిర్ణయింపబడినది కాని స్త్రీ ధనముపైన రాజులకు అధికారము లేదు.

స్త్రీలకు చెందినదంతా స్త్రీ ధనమని గౌతముడి కాలము నాటినుండే ఒక సామాన్యార్థము ఉన్నప్పటికీ కౌటిల్యుని కాలములో స్త్రీ ధనము యొక్క స్వరూపము నిర్వచింపబడినది. వ్యాస కాత్యాయనులు ఈ నిర్వచనాన్నీ ఈ పక్షాన్నీ ఆమోదించారు. కాని అపరార్క యాజ్ఞవల్క్యులు 'తండ్రి ఇష్టపూర్వకముగా వ్రాసి యిచ్చినా ఆ ఆస్తి ఆమె పెనిమిటి వశమైపోతుంది. ఆమెకు దానిపైన అధికారము ఉండ'దని అభిప్రాయపడ్డారు. స్మృతిచంద్రిక కర్త కూడా పై వాదాన్నే బలపరుస్తూ ఆస్తి తండ్రి యిచ్చినదే అయినా స్త్రీ ధనములో చేరదని వాదించాడు. కాని వీరమిత్రోదయకారుడు మాత్రము స్మృతి చంద్రిక వాదనలను ఖండిస్తూ మూడువిధములైన స్త్రీధనముతోపాటు తండ్రి యిచ్చిన ఆస్తి చేర్చవచ్చునని వాదించాడు.

జగన్నాధుని వ్యాఖ్యానములో గృహపాలన చేసినందుకు భార్యకు పెనిమిటి యిచ్చినది కూడా స్త్రీధనమేనని చెప్పబడినది. ఇతర భాష్యకారులు దీనిని ఆమోదించారు. కాత్యాయనుడు మొదలైనవారు పెనిమిటి భార్యకు నగలరూపములో ఇచ్చినదీ, ఆప్తబంధువులు ఇచ్చిన కానుకలూ స్త్రీ ధనానికి చెందినవేనన్నారు. స్మృతి చంద్రిక, సారస్వత విలాస, మయూఖ, మదన పారిజాత, వీరమిత్రోదయ, వివాద తాండవ, వైజయంతి, బాలభట్టటీక, అపరార్క కర్తలు మొదలైనవారు యాజ్ఞవల్క్యని స్మృతి నామోదించి చేసిన వాఖ్యానాన్ని అనుసరించినవారే వ్యాఖ్యానకారుల భిన్నాభిప్రాయాలవలన స్త్రీ ధనమని చెప్పబడినదానిలో భేదాలు కలిగినవి. భిన్న దృక్పథములవలన అర్థము మారిపోతూ వచ్చినది.

జీమూతవాహనుడు ప్రాచీన వ్యాఖ్యాతల ననుసరించి స్త్రీ ధనాన్ని నిర్వచించాడు. ఆయన సూత్రాలు స్మృతిచంద్రికను అనుసరించినవి. విజ్ఞానేశ్వరుని దృష్టిలో స్త్రీ ధనము ఏరూపమున ఉన్నప్పటికీ ఆమెకు చెందినదంతా స్త్రీ ధనమే. దీని తరువాత 'స్థిరాస్తి కూడా స్త్రీ ధనానికి చెందినదేనా - లేక - చరాస్తిమాత్రమేనా' అను సందేహము ఒకటి ఏర్పడటానికి అవకాశము కలిగింది. ఈ తర్జన భర్జనలలో కొంతకాలము గడచిన తరువాత నందపండితుడు 'వివాహ కాలమందు కట్న కానుక రూపమున వధువుకు చెందినది, వారసత్వము వల్ల సంక్రమించినదీ, కొన్నదీ, వాటాగా లభించినదీ, స్వీకరించినదీ, నగలరూపమున లభించినదీ, స్త్రీ ధనము అనబడును' అని వైజయంతిలో నిర్వచించాడు.

అపరార్కుడు స్త్రీ ధనాన్ని రెండు విధములుగా విభజించాడు, సౌదాయికము, సౌదాయకము కానిదీనని. సౌదాయికమనగా భార్యకు సంపూర్ణాధికారము గల ఆస్తి అని అర్థము. సౌదాయికము కాని దానిమీద భర్త జీవించిఉన్నంతవరకూ భార్యకు సంపూర్ణాధికారము లేదని భావము. స్మృతి చంద్రిక తల్లికి చెందినది స్త్రీధనమని నిర్వచిస్తున్నది. స్త్రీ ధనముపైన స్త్రీకి సంపూర్ణాధికారాలను ఆమోదించిన దాయభాగము స్త్రీ ధనాన్ని నిర్వచింపకపోగా కొంతభాగాన్ని వేరు పరచింది. కాత్యాయనుడు ఏరకపు ఆస్తి స్త్రీ ధనములో చేరదో కచ్చితముగా తెలిపాడు. అపరిచితుల చేత అభిమాన పూర్వకముగా నయినా సరే - బహూకరింపబడిన వాటిని స్త్రీ ధనములో చేర్చరాదని తీర్మానించాడు మోసము చేతగాని, దురభిప్రాయముతోగాని లభించినవి స్త్రీ ధనములో చేర్చటానికి నిరాకరించాడు. వ్యాపారస్థులు నష్టము వచ్చినపుడు భాగస్వాములను నమ్మించడానికి తన యింట స్త్రీధనము తప్ప మరేమీ లేదని బొంకుతారు కనుక స్త్రీ ధనమునకు ఒక పరిమితిని ఏర్పరచటము క్షేమమని భావించి, రెండు వేల అణాల కంటే స్త్రీ ధనము మించకూడదనీ స్థిరాస్తిని దానిలో చేర్చరాదనీ నిర్వచించాడు.

ఈ విధముగా వివిధ కాలముల భిన్నాభిప్రాయాలుగల స్మృతికారులు భాష్యకారులూ, వాఖ్యానకర్తలూ స్త్రీ ధనాన్ని గురించి నిర్వచిస్తూ వచ్చారు. ఈ వివాదాలకు గురి అయిన సంఘము స్త్రీ ధనములో ఆస్తి ఎక్కువగా కలవకుండా జాగ్రత్తపడుతూనే వచ్చింది. ఆభరణాలు స్త్రీ ధనములో చేరినవనే దానిలో అభిప్రాయ భేదము ఎవరికీ లేదు కనుకనూ సాధారణముగా స్త్రీ ధనము ఆభరణ రూపములోనే ఉంటూ వచ్చినది. స్త్రీలకు ఆభరణాలమీద ఆశకలగటానికి కారణము అలంకరించుకొని సౌందర్యాన్ని ఇనుమడింపజేసుకోవాలన్న తలంపే కాకుండా ఈ భావం కూడా ఇమిడి ఉన్నదనుకోవటములో దోషము లేదు. స్త్రీ ధనము విషయంలో భిన్నాభిప్రాయాలకు తావు లేకుండా హిందూకోడ్ బిల్లులో సవరణ జరిగింది. ఈ కోడ్ అమలులోకి వచ్చిన తరువాత నుండీ స్త్రీలకు సంక్రమించే ఆస్తిపైన వారికి అనుభవాధికారమే కాకుండా, దానాదమ వాది సర్వహక్కులు కూడా ఏర్పడుతాయి. ఈ కోడ్ అమలులోనికి వచ్చిన తరువాత కూడా వీలునామా, దానపత్రం మొదలైన వాటి ద్వారా లభించే ఆస్తిపైన మితమైన స్వామ్యాన్ని మాత్రమే పొందచేసే హక్కు ఆస్తిని యిచ్చేవారికి ఉంటుంది. ఈ కోడ్ ననుసరించి స్త్రీ ధనము స్థిరాస్తిగాని చరాస్తిగాని అయిఉండవచ్చు. వివాహానికి పూర్వముగాని, వివాహకాలమందుగాని, వివాహానంతరముగాని, వితంతువుగా ఉన్నప్పుడుగాని, విభాగముద్వారా గాని, దానపత్రము ద్వారాగాని, భరణానికి సంబంధించినదిగాని, ఇతరత్రా లభించినదిగాని స్త్రీ ధనమే అవుతుంది ఈ ఆస్తిపైన స్త్రీలకు సంపూర్ణాధికారము ఉంటుంది.

ఈ కోడ్ అమలులోనికి వచ్చిన తరువాత ఆస్తి గల స్త్రీ మరణించినట్లయితే ఈ కోడ్‌లో నిర్ణయింపబడినవారు తప్ప ఇతరులు ఆమె ఆస్తికి వారసులు కాదు. జీవితాంశ హక్కు మాత్రమే ఉన్నటువంటి ఆస్తి వారసత్వము ద్వారా గతించిన స్త్రీకి లభించినట్లయితే, ఆమె మరణాంతరము ఈ కోడ్ నిర్ణయించిన ప్రకారము ఆమె వారసులకు చెందుతుంది. విభాగము ద్వారా లభించినట్లయిన న్యాయశాస్త్రము నిర్ణయించిన విధముగా వారసులు పొందగలరు.

ఈ కోడ్ అమలులోకి వచ్చిన తరువాత స్త్రీకి వివాహ సంబంధమైన కట్నము పైన సంపూర్ణాధికారము ఉంటుంది.

వధువుకు యిచ్చిన కట్నము ఎవరి అధీన

ములో ఉన్నా మైనారిటీ వెళ్ళగానే ఆమె స్వాధీనము చేయవలసి వుంటుంది. మైనారిటీ వెళ్ళకుండానే ఆమె గతించినటులయితే ఆ ఆస్తి ఈ కోడ్‌లో నిర్ణయింపబడిన వారసులకు చెందుతుంది

కట్నమనగా వివాహ కాలమందు పుట్టింటి వారగాని అత్తింటి వారుగాని వసువుకు యిచ్చినది

విలునామా వ్రాయకుండా ఏ స్త్రీ అయినా మరణించినట్లయిన ఆమె ఆస్తికి వరుసగా ఈ క్రింద పేర్కొనబడినవారు వారసులవుతున్నారు. మొట్ట మొదట ఆమె సంతానానికి, స్త్రీ పురుష తారతమ్యము లేకుండా, సమానముగా చెందవలసి ఉంటుంది ఈ సంతానములో మృతి చెందిన కుమార్తెల బిడ్డలు, మృతి చెందిన కుమారుల బిడ్డలు కూడా చేర్చబడుతున్నారు సంతానము తిరువాత క్రమములో చనిపోయిన స్త్రీ పెనిమిటి హక్కుదారుడు అవుతున్నాడు. వీరెవరూ లేని పక్షమున ఆస్తి చనిపోయిన స్త్రీ తలిదండ్రులకు చెందవలసి ఉంటుంది. వీరి తరువాత తండ్రి ఆస్తికి వారసులయిన వారికి చెందివలసి ఉంటుంది. వీరి తరువాత తలి ఆస్తికి వారసులయిన వారికి చెందుతుంది వీరి తరువాత పెనిమిటి ఆస్తికి వారసులయినవారికి చెందుతుంది.

హిందువుల వారసత్వాధికారానికి సంబంధించిన భాగమును లోక్ సభా సభ్యులు జాయింటు కమిటీలో చేరి సవరించవలెనని రాజ్యసభ చేసిన సిఫారసును లోక్ సభ ఆమోదించింది. రాజ్యసభలో ఈ ప్రతిపాదన 1955 మార్చి 25 వ తేదీన జరిగిన సమావేశములో ఆమోదింపబడి, మార్చి నెల 28 వ తేదీన లోక్ సభకు అంపచేయబడినది ఆనాటి సమావేశములో, లోక్ సభా సభ్యులలో 30 మంది సభ్యులను నియామకముచేసి, వారిని జాయింటు కమిటీతో కలిసి పని చేయవలసినదని నిర్ణయించటము జరిగింది. ఈ 30 మందిలో 5 గురు స్త్రీలు శ్రీమతులు రాజేశ్వరీ సిన్హా, ఉమానెహ్రూ, జయశ్రీ రాయజీ, సుచేతా కృపలాని, రేణూ చక్రవర్తి గారలు ఉన్నారు.

నూతనముగా సవరింపబడిన హిందూ కోడ్ బిల్లు ప్రకారము సంతానములో స్త్రీ పురుష తారతమ్యము లేకుండా సమాన భాగము పొందటానికి అధికారము లభించింది. ఈ బిల్లు రాజ్య సభలో నవంబరు 30 న ఆమోదింప బడినది. ★

# గురుపరీక్ష

## (7-వ పేజీ తరువాయి)

వాల్చకుండా చూచింది. ఆమెకళ్లు జేవులించాయి! కాని ఆ చూపులు కన్నీటిలో మునిగిపోయాయి! శిష్యులకు అంతవరకు ధౌమ్యునియెడల కలిగిన భయభక్తులణుమాత్రమైనా మిగలకుండా అంతరించిపోయాయి! వారందరు ఆచార్యునికుశ్చేష్టితాలు తెలుసుకొని ఉగ్రులైనారు!

కన్నీళ్ళతో తడిసిపోయిన ధౌమ్యాచార్యుని గడ్డం చివర్లనించి కన్నీటి బిందువులింకా ప్రవహిస్తూనే ఉన్నాయి! గురుపత్ని ఒడిలో తలదాచుకున్న ఉపమన్యుని చుబుకం స్పృశించి గద్గదంతో ఒణికిపోతూ ధౌమ్యుడతనితో ఇలాగన్నాడు: "నా చిట్టి తండ్రీ! ఉపమన్యూ! నిన్నెన్నో విధాలుగా హింసించాను. ఎంతో రాక్షసత్వం వహించాను! కాని ఈ వేదాధ్యయనం మహా కర్కశమైనటువంటి అసిధారా వ్రతం నాయనా! అలసులకు, శ్రద్ధాహీనులకు, వేదజ్యోతి దర్శనం కానేరదు! నీ అభినివేశము, నీ అధ్యయన దీక్ష పరీక్షించడానికే నిన్నిన్ని విధాలుగా బాధించాను! నా శిష్యులెవరున్నూ ఇంతటి గురు పరీక్షకు తాళలేదు! కనక వారెవరున్నూ మంత్ర ద్రష్టలు కాలేకపోయినారు! నీ అభినివేశం దేవతలు కూడా హర్షించదగ్గది. నీవు సాంగ వేద జ్యోతి సందర్శనం కాగలదు! నా శిష్యులలో నీ వొక్కడవే మంత్ర ద్రష్టవు కాగలవు!"

ఉపమన్యుడు అటు ఇటు తిరుగుతుంటూ ఆయన పాదసన్నిధిని సాష్టాంగ నమస్కారం చేశాడు. శిష్యుల సాధువాదాలు మిన్నుముట్టాయి.

ఆచార్యుడు ఉపమన్యుని లేవనెత్తి "ఉపమన్యూ! ఒక్కసారి అశ్వినీదేవతలను స్తుతించుకో! తిరిగి నీకు దివ్యమైన దృష్టి లభిస్తుందిలే!" అన్నాడు ఉపమన్యుడు, శిష్యులు, ఆచార్య దంపతులు ఒక్క గొంతుతో వేద మంత్రాలుచ్చరిస్తూ అశ్వినీ దేవతల ననేక విధాలుగా స్తోత్రాలు చేశారు!

వెంటనే ఉపమన్యుని నేత్రాలుజ్యోతుల్లా వికసించాయి! పక్కనే ఉన్న లేగ దూడ అతని చేతివేళ్లు కుడుచుకుంటూ 'అంభా' అని అరిచింది! దట్టంగా కారుమబ్బులు పట్టిన ఆకాశంలో తళుక్కుని ఒక్క మెరుపు మెరిసింది! ★

ఈ శతాబ్దంలో జరిగిన రెండు గొప్ప సంఘటన లేమిటని ఒక రాజకీయవేత్తను ఒకరు అడగ్గా
"ఈ శతాబ్దంలో రెండు సార్లు ప్రపంచశాంతి సంభవించింది" అని సమాధానమిచ్చాడు.




# నల్లద్దాల కళ్లజోడు

మూలం: తామస్ కెయిన్

అనుసరణ: మధురాంతకం రాజారాం.

[ఇంకా తెర లేవలేదు. తెర వెనుకనుంచీ బిగ్గరగా మాటలు వినిపిస్తుంటాయి.]

మొదటి గొంతు: పాపానికి ప్రతిఫలం ఎప్పుడైనా అనుభవించవలసిందే సింహాద్రీ! వద్దు. నా మానాన నన్ను వదలిపెట్టు.

రెండో గొంతు: వదలిపెట్టడమే! సాధ్యంకాదు. బ్రతుకుపైన ఆశ వదులుకో చలపతీ! మూడు క్షణాలు మాత్రమే గడువిస్తున్నాను.

మొ. గొం: (గాద్గద్యంతో) వద్దు సింహాద్రీ!

రెం. గొం: లాభంలేదు. ఈ క్షణమే నీది. కళ్లుమూసుకుని దేవుణ్ణి ప్రార్థించుకో.

మొ. గొం: సింహాద్రీ! సింహాద్రీ!

[తుపాకీ పిస్తోలు కాల్చిన

~~~~~~~~

**పాత్రలు**

చలపతి } వ్యాపారంలో భాగ
సింహాద్రి } స్వాములు.
విశ్వం: నిరుద్యోగి
రంగయ్య: నౌకరు
సత్యనారాయణ: సబ్ ఇన్స్పెక్టరు.

~~~~~~~~

చప్పుడుతోబాటు, తెర మెల్లగా పైకి లేస్తుంది. టేబిల్‌కు ప్రక్కన చలపతి హృదయంపైన రక్తం స్రవిస్తుండగా క్రింద పడివున్నాడు. సింహాద్రి పిస్తోలును శుభ్రంగా తుడిచి టేబిల్‌పైన వుంచి పారిపోడానికోసం ద్వారందగ్గరకు పరుగెత్తుతాడు. ఇంతలో అడుగుల సవ్వడి వినిపిస్తుంది. సింహాద్రి కంగారుపడిపోతుండగా, నల్లద్దాల కళ్ళజోడు వేసుకున్న విశ్వం ద్వారం దగ్గరికి వచ్చి నిలబడతాడు.]

సిం: ఎవరు నువ్వు? ఏం కావాలి?

వి: చలపతిగారికోసం వచ్చానండీ!

సిం: ఎందుకూ? నీ పేరు?

వి: నన్ను విశ్వం అంటారండీ. పూర్తి పేరు విశ్వనాథమూర్తి. ఇంకా అరగంట కూడా కాలేదనుకుంటాను. ఫోనులో చలపతిగారితో మాట్లాడాను. ఆయన నన్ను తక్షణమే బయల్దేరి రమ్మన్నాడు.

సిం: (ఆలోచనగా గడ్డాన్ని తడవుకుంటూ) లోపలికి వచ్చి కూర్చో.

వి: చలపతిగారున్నారాండీ?

సిం: ఉన్నారులే.

వి: (లోపలికి వచ్చి) ఎక్కడ కూర్చోమంటారండీ!

సిం: అదీ కూడా చెప్పాలేమిటి! (విశ్వం చేతిని పట్టుకుని కుర్చీ దగ్గరికి లాక్కెళ్తూ) ఈ కుర్చీపైన కూచో. (ద్వారందగ్గరికి వెళ్ళి) రంగయ్యా! రంగయ్యా! ఏమైపోయావురా బాబూ!

వి: (పైకి లేస్తూ తొట్రుపాటుతో) ఏం జరిగిందండీ! ఎందుకలా గాబరా పడుతున్నారు?

సిం: వివరాలన్నీ తీరిగ్గా విందువుగానీ, నువ్వు నెమ్మదిగా కుర్చీపైన కూచో.

రం: (తొందరగా ప్రవేశిస్తూ) పిలిచారాండీ!

సిం: పిలిచానా! నెత్తిన నోరు పెట్టుకుని మొత్తుకుంటున్నానురా బాబూ! చలపతి చనిపోయాడు. హత్య! ఘోరమైన హత్య! క్రిందికి వెళ్ళి పోలీసుస్టేషనుకి ఫోను చెయ్. ఇదిగో! హంతకుడు పట్టుబడిపోయాడని కూడా చెప్పు.

రం: (నిష్క్రమిస్తాడు.)

వి: అదేమిటండీ! చలపతిగారు చనిపోయారని చెబుతున్నారు!

సిం: చలపతి చనిపోయినట్టు నేనుమాత్రం చెబుతున్నానా! ప్రపంచంలో ఎవరైనాసరే ఇప్పుడు చలపతిని చూస్తే చనిపోయాడనే నిర్ణయిస్తారు. ఆమాటకొస్తే యిది ఆయువు మూడి చనిపోవడం కాదు. విశ్వంగారూ! ఖూనీ! పచ్చి ఖూనీ!

వి: దుర్మార్గుడు! ఎవడండీ వాడు?

సిం: (వికటంగా నవ్వుతూ) మంచి ప్రశ్నే! ఆ దుర్మార్గుడెవడో నీకే తెలియదా విశ్వం? బాగుంది, బాగుంది!

వి: అబ్బబ్బ, నాకేం దిక్కులు తోచడం లేదండీ!

సిం: ఐతే కొంచెం వివరించమంటావా విశ్వం! విను. చలపతికోసం నేను మేడమెట్లెక్కి వస్తున్నాను. పిస్తోలు కాల్పు చెవుల్లో గింగురుమని మారుమ్రోగింది. ఒక్క పరుగుతో ఈ గదిలోకి వచ్చిపడ్డాను. అప్పుడు తమరు వ్రేలిముద్ర లెక్కడ కనపడతాయోనని ముందు జాగ్రత్తతో పిస్తోలును తుడిచి శుభ్రం చేసి టేబిల్‌పైన పెడుతున్నారు. నేను కనబడగానే హడలెత్తిపోయి, దాన్ని మళ్ళీ పైకితీసి నాక్కూడా గురిపెట్టారనుకోండి. ఐతే వీడు చలపతి కాడండీ విశ్వంగారూ! సింహాద్రి! వీడిదగ్గర తాటాకు చప్పుళ్ళు సాగవు.

వి: బాబ్బాబూ! నేనే పాపమూ ఎరుగను. చలపతిగారితో నాకెలాటి విరోధమూ లేదు. ఆయన్నింతకుమునుపు నేను చూడనైనా చూడలేదు. అకారణంగా నేనిలాటి పని ఎందుకు చేస్తానండీ?

సిం: ఏమో! ఆ కారణం నువ్వు నాకెందుకు చెబుతావు! ఉండు. ఈ అద్భుత గాథని వినడానికి పోలీసులీపాటికి వస్తుంటారు.

వి: నాకేం తెలియదండీ బాబూ! నేనిక్కడికి వచ్చేసరికే మీరు గదిలో వున్నారు. నన్ను చూడగానే మీరు...

సిం: అబద్ధాలు! అన్నీ అబద్ధాలు! ఐనా నా పిచ్చిగానీ లారీ దెబ్బలు పడకపోతే నిజమెలా బయటికొస్తుందిలే!

వి: అబద్ధాలు కావండీ! నేను మేడ మెట్లెక్కుతుండగా కాల్పు వినపడింది. ఇక్కడికి వచ్చి నిలబడ్డాను. ఏదో వాసన నాదాకా వచ్చింది. ఇప్పుడు తెలుస్తోంది, అది నల్లమందు వాసన. చలపతిగారిని చంపింది మీరు. (మెల్లగా) మీరా నేరాన్ని నాపైకి తోయాలనుకుంటున్నారు. ఇది అన్యాయం! అక్రమం! (వెళ్ళిపోడాని కుద్యమిస్తూ పైకి లేవబోతాడు).

సిం: (కదలనీయకుండా విశ్వం భుజాలు పట్టుకుంటూ) అసాధ్యుడివేనోయ్ విశ్వం! కాని నీ కుప్పిగంతులు ఈ హనుమంతుడి దగ్గర సాగుతాయా చెప్పు. పోనీ, చలపతికీ నీకూ వున్న సంబంధమేమిటి? అతణ్ని నువ్వు వెదుక్కుంటూ రావలిసిన అవసరం?

వి: ఆయన నాకు ఉద్యోగం యివ్వడానికి ప్రయత్నిస్తానన్నాడు. అందుకోసం తనని కార్యాలయంలో కలునుకోమన్నాడు.

సిం: ఉద్యోగమా! నీకు చలపతి ఉద్యోగం యిస్తానన్నాడా! కాదు, కాదు. ఇవ్వడానికి ప్రయత్నిస్తానని మాత్రం అన్నాడు కదూ!

వి: ఆయన నన్నిక్కడికి రమ్మన్నాడండీ!

సిం: నీకు తెలుసో తెలియదో విశ్వం! వ్యాపారంలో నేనూ, చలపతీ భాగస్వాములం. నాతో సంప్రదించకనే చలపతి నీకు యివ్వదలిచాడన్నది వట్టి గాలికబురు. డియర్ విశ్వం! నువ్వింతకంటే మంచి కారణం ఊహించుకోడం ఎందుకైనా మంచిది. పోనీ, అతడు నిన్ను రమ్మని వ్రాసిన ఉత్తరంవుంటే చూపిస్తావా ఒక్కసారి!

వి: ఉత్తర మెక్కడితండీ!

ఆయనా నేనూ ఫోనులో మాట్లాడుతున్నాం.

సిం: బాగుంది. ఐతే యిదేమంత బలమైన కారణంగా కనిపడ్డం లేదు విశ్వం! ఇలాంటి కథని ఎంతటి పనికిమాలిన నేరస్థుడయినా యిట్టే ఊహించుకోవచ్చు. వెరీ సారీ! నీలాంటివాళ్ళు మరి కొంచెం నమ్మదగ్గ చక్కటి కథలు ఊహించుకోవాలి విశ్వం! ఇప్పుడు నేను వాస్తవంగా జరిగిన కథ చెబుతాను. నువ్వు దొంగవి! ఈ గదిలో ఇనప్పెట్టె తెరవడానికి ప్రయత్నిస్తుండగా నువ్వు చలపతి చేతిలో పడిపోయావు. పారిపోవడానికి దోవ దొరక్క నువ్వతణ్ణి కాల్చి చంపేశావు. అయ్యో చలపతీ! నీకు రావలిసిన చావు కాదిది!

[ఇన్స్పెక్టరు సత్యనారాయణని వెంటబెట్టుకుని రంగయ్య ప్రవేశిస్తాడు.]

రం: ఇన్స్పెక్టరు సత్యనారాయణగారు బాబూ!

సిం: నమస్కారమండీ! నేను సింహాద్రిని. చనిపోయిన చలపతీ, నేనూ వ్యాపారంలో భాగస్థులం. ఈరోజు నేనిక్కడికి వచ్చేసరికి...

వి: ఇన్స్పెక్టరుగారూ! మీరు దేవుడిలా వచ్చారు. నిజానికి నాకేమీ తెలియదు. నేను మీకు అపరిచితుణ్ణిగాను. నేనెలాంటివాడినో మీకు తెలుసు. ఈరోజు నేను చలపతిగారి కోసం...

సిం: కాదండీ! చలపతికోసం నేను...

వి: అబ్బే కాదండీ! చలపతిగారి కోసం నేను...

స: ఆగండి! ఒక్కమనిషి ఒక్కసారిగా ఒకరి మాటలు మాత్రమే వినడానికి సాధ్యపడుతుంది. మొదట సింహాద్రిగారూ, మీరు కానివ్వండి.

వి: అసలు విషయం చెప్పనివ్వండి ఇన్స్పెక్టరుగారూ! ఆయన నేరాన్ని నాపైన తోయడానికి ప్రయత్నిస్తున్నాడు.

స: సరే. నువ్వంతటితో ఊరుకో విశ్వం. మీరు ఉపక్రమించండి సింహాద్రిగారూ!

సిం: నేను వ్యాపారంలో చలపతికి భాగస్వామినని చెప్పాను కదండీ!

స: చెప్పారు.

సిం: పదిహేను నిమిషాలై వుంటుంది. మేడమెట్లెక్కుతూ పిస్తోలు కాల్పు విన్నాను. పరుగుతో గదిలోవచ్చి పడేసరికి చలపతి క్రింద పడివున్నాడు. ఇతడేమో పిస్తోలును శుభ్రపరచి టేబిల్‌పైన వుంచుతున్నాడు. హఠాత్తుగా నేను గదిలోకి రాగానే ఇతడు నన్నూ ఒక చెయ్యి చూడ్డానికి ప్రయత్నించాడు. కానీ సాధ్యంకాలేదు. నేనితణ్ణి కుర్చీపైన కూలదోసి మా నౌఖరును పిలిచి మీకు ఫోను చేయమన్నాను. మీరు సరిగ్గా సమయానికి ఆదుకున్నారు.

స: ఇంతకు మునుపు మీకీ మనిషితో పరిచయం లేదాండీ?

సిం: అబ్బే, ఇతడెవరో నాకు తెలిసింది యిప్పుడే కదండీ?

స: ఎప్పుడు?

సిం: ఇప్పుడే, ఈ గదిలో ఇతడు చలపతి శవం పక్కన కనబడినప్పుడు. ఎలాగూ ఇతడు మీతో అప్పుడే

### నవల అమ్మడానికి మార్గం

ఒక వార్తాపత్రికలో ఈ ప్రకటన పడింది: "కోటీశ్వరుడు, అందగాడు, యువకుడు అయిన ఒక ఆసామికి వధువు కావలెను. వధువు అందచందములలో నేమి, గుణశీలములలో నేమి ఫలానా రచయిత వ్రాసిన నవలలోని నాయికను పోలియుండవలెను."

ఈ ప్రకటన పడిన ఇరవైనాలుగు గంటలలో ఆ నవల కాపీలన్నీ అమ్ముడైపోయాయి.

పరిచయం కలుపుకున్నాడు గదండీ!

స: నిజమే. విశ్వంతో మాకు చాల రోజులనుంచీ పరిచయంవుంది.

సిం: పోలీసువాళ్ళకీ, దొంగలకీ త్రెంపినా తెగని సంబంధం కదండీ మరి!

వి: ఇన్స్పెక్టరుగారూ!

స: నువ్వు మరికొంతసేపు ఊరుకోవాలి విశ్వం. ఎక్కడ రంగయ్యా?

రం: ఇదిగో ఉన్నానండీ!

స ఇందును గురించి నీకేం తెలుసు?

రం: నాకాండీ! నాకు తెలిసిందేమంత...

స: పోనీ, నీకు కాల్పు వినిపించింది కదూ!

రం: అప్పుడు నేనది కాల్పనుకోలేదండీ! రోడ్డులో బస్సు టైరేదైనా బర్స్టు అయివుంటుందనుకున్నాను.

స: అలాగా! అప్పుడు టైమెంతయివుంటుంది?

**బాలగేయం:**

# మా దేశం

### రెంటాల గోపాలకృష్ణ

పాడిపంటల తల్లి మా భరతమాత
బంగారు గడ్డయే! మా భరతమాత!

విశ్వసౌందర్యాలు వెదజల్లు మా తల్లి
విజ్ఞానదీపికలు వెలిగించు మా భూమి!
పుణ్యాల పుట్టిల్లు, ధర్మాలకిది నెలవు
దేశదేశాలలో ఖ్యాతిగాంచిన తల్లి!

గనులన్ని త్రవ్వాలి, ధనరాసు లెత్తాలి
ధగధగా వెలిగేటి నగరాలు లేవాలి!
మా భూమి పండాలి, మా ఇల్లు నిండాలి
మా దేశ మాకాశదీపమై వెలగాలి!

నదులన్ని నిండాలి, పొలములో పారాలి
నవధాన్యములు పండి, గాదెలే నిండాలి!
కవులు, గాయక శిల్పకారులందరు గూడి
నవ్యశోభలతోటి నాట్యాలు చేయాలి!

ఇది శాంతిమందిరం, భూలోక నందనం
ఇది సత్యసాధనం, ఇది నిత్యమంగళం!
పాడిపంటల తల్లి మా భరతమాత
బంగారు గడ్డయే! మా భరతమాత!!

రం: ఏమో! నేను గడియారం చూడలేదండీ!

స: అచ్చే, చూచివుండవులే. ఈ ప్రశ్నకు మాత్రం నువ్వు జాగ్రత్తగా సమాధానం చెప్పాలి. నువ్విక్కడికి వచ్చేసరికి సింహాద్రిగారెక్కడున్నారు? విశ్వం ఎక్కడున్నాడు?

రం: ఇతడేమో కుర్చీలో కూచునివున్నాడండీ. మరి సింహాద్రిగారేమో నన్ను పిలుస్తూ ద్వారం దగ్గర నిల్చున్నారు.

స: పిస్తోలు?

రం: అదేమో, యిప్పుడెక్కడుందో అక్కడే కనిపించిందండీ!

స: సరే నువ్వు వెళ్లిపోవచ్చు. ఇక నువ్వు కానీయ్ విశ్వం.

వి: ఏమన్నం చెప్పమంటారు ఇన్‌స్పెక్టరుగారూ! ఇదంతా మోసం గదా.

స: నువ్వెందుకొచ్చావిక్కడికి?

వి: ఉద్యోగం కోసం.

స: ఏమిటా వుద్యోగం?

వి: టైపిస్టుగానండీ! మీకు తెలుసు పుట్టుకతోనే నేను దురదృష్టవంతుణ్ణి. టైప్ నేర్చుకోడానికి చాలా కష్టపడ్డాను. ప్రత్యేకంగా ఒక ప్రవీణుని దగ్గర శిక్షపొందాను. ఇంతవరకూ నేను పనిచేస్తున్న కార్యాలయంలో వాళ్ళకిక టైపిస్టుతో అవసరం లేకపోయింది. ఒకమిత్రుడు చలపతిగారితో మాట్లాడమన్నాడు.

స: మాట్లాడావా?

వి: ఫోనులో మాట్లాడానండీ! ఆయన నన్ను యిక్కడికి రమ్మన్నాడు.

స: సరే, ఇక నువ్వారుకుని ఒకసారి నన్నీ పిస్తోలు పరీక్షించనివ్వు.

సిం: ఏంలాభమండీ! ఈ హంతకుడు మహాచతురుడు. నేను వచ్చేసరికి పిస్తోలుమీద వ్రేలిముద్రలు కనబడనీయకుండా తుడిచి...

స: ఈ సంగతి మీరు యింతకు ముందే ఒకసారి చెప్పారు కదండీ! (భూతద్దంతో పిస్తోలును పరిశీలిస్తూ) మీరన్నట్టు పిస్తోలు శుభ్రంగా వుంది. వ్రేలిముద్రలు కనపడ్డం లేదు. (ఆలోచనతో అటూ, యిటూ తిరుగుతూ వున్నట్టుండి) సింహాద్రిగారూ! మీరు వచ్చేసరికి హంతకుడెక్కడ నిలబడివున్నాడో చెప్పగలరా?

సిం: సరిగ్గా యిక్కడే నిలబడివున్నాడండీ! ఒక్కయించీ కూడా బేబందులేకుండా చెబుతున్నాను.

స: ఈ విషయంలో ఎంత మాత్రం సందేహం లేదన్నమాట!

(56-వ పేజీ చూడండి)

బాలసాహితి సీరియల్

# మార్టిన్ రాట్లర్

మూలం: ఆర్. ఎమ్. బాలన్‌టైన్

## 21

మార్టిన్ రాట్లర్‌ను గదిలో బంధించిన తరవాత రెండు గంటల పైగా ఎవరూ అతన్ని చూడడానికి రాలేదు. బాగా చీకటిపడిపోయింది ఆకలి దహిస్తోంది. ఎలా తప్పించుకుపోవడమా అని ఆలోచించాడు. కొంతసేపటికి తలుపులు తెరుచుకున్నాయి. నీగ్రో బానిస ఒకడు లోపలికి వచ్చాడు. నాలుగు చక్కని కొవ్వొత్తులు తీసుకువచ్చి లోపల పెట్టాడు. ఇంకో బానిసవచ్చి బల్లమీద భోజనం అమర్చాడు. తరవాత ఇద్దరు బానిసలూ తలుపులు వేసి వెళ్ళిపోయారు.

మార్టిన్‌కు ఇదేమీ అర్థంకాలేదు. భోజనం చూస్తే నోరూరిపోతోంది. అన్ని రకరకాల పదార్థాలు, పళ్ళు అతను ఎన్నడూ చూడలేదు. చీకటి కొట్టులో బంధించి ఈ ఖరీదైన భోజనం పంపించడం చూస్తే గనుల అధికారి చాలా చిత్రమైనవాడిలాగా ఉన్నాడనుకున్నాడు. లేచి భోజనం ఆరగిద్దామనుకుంటూండగా తలుపులు మళ్ళీ తెరుచుకున్నాయి. బారన్ ఫగోసీ లోనికి వచ్చాడు. తలుపులు మూశాడు. చేతులు నులుముకుని, టోపీ కిందినుంచి మార్టిన్‌ను చూస్తున్నాడు.

మార్టిన్ కోపం పట్టలేకపోయాడు. "ఏం వేళాకోళం ఇది మహాశయా? నన్ను అన్యాయంగా బంధించింది చాలక, వెక్కిరించడానికి వచ్చావా?"

దీనికి బారన్ ఫగోసీ సమాధానం ఏమీ ఇవ్వలేదు. హఠాత్తుగా మార్టిన్ దగ్గిరకి దూకి బలిష్ఠమైన హస్తాలతో అతన్ని కౌగిలించుకుని ఎముకలు విరిగిపోయేంతగా నలిపివేశాడు.

"మార్టిన్! మార్టిన్! నువ్వేనా బాబూ! నా చిట్టితండ్రీ! నిన్ను చూసి ఎన్ని నెలలైంది? నిన్ను మళ్ళీ చూస్తానని అనుకోలేదు నాయనా!" అని అతి కష్టంమీద గద్గదస్వరంతో అన్నాడు బారన్ ఫగోసీ; కాదు కాదు బార్నీ ఓఫ్లానగన్.

అతడు బార్నీయే అని తెలియగానే మార్టిన్ సంతోషం చెప్పతరంకాదు. ఒక పావుగంటసేపు వారు సంతోషంతో ఉక్కిరిబిక్కిరై సరిగా మాట్లాడలేకపోయారు.

బార్నీ తన టోపీ తీసివేశాడు. మార్టిన్‌పక్కన కూర్చున్నాడు. "ఆకలిగా ఉన్నావేమో, ముందు భోజనం కానియ్. తరవాత మాట్లాడుకుందాం," అన్నాడు.

భోజనంచేస్తూ మార్టిన్ అడిగాడు: "నువ్విక్కడికెలా వచ్చావ్? నీ పని మహారాజభోగంగా ఉందే?"

"నే నిక్కడికి నాలుగు నెలలకింద వచ్చాను. ఈ గనికి ఒక ఐరిష్‌వాడు యజమాని. నేనూ ఐరిష్ వాణ్ణే అని తెలుసుకుని చాలా ఆదరించాడు. నన్ను తన దగ్గిరే ఉంచుకున్నాడు. ఒకరోజున అతడు తనకిక్కడ ఏమీ తోచడంలేదని, తాను రియోడి జనిరో (బ్రెజిల్ రాజధాని) వెళ్ళిపోతాననీ, తన స్థానంలో నన్ను ఇక్కడ ఉండమనీ బతిమాలుకున్నాడు. నేను ఐరిష్‌వాణ్ణని తెలిసి అందరూ మోసంచేయడానికి

అనువాదం: నండూరి రామమోహనరావు

ప్రయత్నిస్తారని, అందుచేత ఏ రహస్యగానో పోలీసు వాడుగానో నటించమనీ చెప్పాడు."

"అయితే ఈ గనికి నువ్వే అధికారివన్నమాట" అని మార్టిన్ అడిగాడు.

"అవును. రాబడిని ఎప్పటికప్పుడు రియో డి జనీరోకి పంపించేస్తున్నాను. కాని నా కిక్కడ ఏమీ బాగాలేదు. ఎప్పుడు మళ్ళీ సముద్రయానం చేస్తానా అని ఆదుర్దాగా ఉన్నది."

"మీ యజమానికి కోపంరాదూ, నువ్వు వెళ్ళిపోతే?"

"రాదు. నా కెప్పుడు వెళ్ళిపోవాలనుంటే అప్పుడు వెళ్ళిపోవచ్చనీ, వెళ్ళిపోయేటప్పుడు ఇక్కడి ఇంగ్లీషు దుబాసీకి పని అప్పజెప్పి పొమ్మనీ ఆయన నాతో అన్నాడు. ఒక వారంరోజుల్లో బహుశా మనం బయల్దేరవచ్చనుకుంటాను. ఒకటో రెండో వజ్రాలు జేబులో వేసుకునేది, మాట్లాడకుండా వచ్చినదారి పట్టేది. అంతే" అన్నాడు బార్నీ పైపు వెలిగించి గట్టిగా దమ్ము లాగుతూ.

మార్టిన్ తాను రెడ్ ఇండియన్లనుండి ఎలా తప్పించుకుని వచ్చిందీ చెప్పాడు. తరవాత బార్నీ తా నెలా పారిపోయివచ్చిందీ చెప్పసాగాడు. అతడు చెప్పిన దిది:

బార్నీని బంధించిన ఇండియన్లు అతన్నితమతో బలవంతాన లాక్కుపోయి ఎక్కడో పర్వతాల మధ్య ఉన్న తమ గ్రామానికి చేర్చారు. మాటిమాటికీ అతడు తప్పించుకుపోవాలని ప్రయత్నాలు చేయడం చేత వా రతన్ని కాళ్లు చేతులు కట్టివేసి ఒక చిన్న గుడిసెలో పడేసిఉంచారు. అలా మూడు వారాలపాటు ఉన్నాడు. ఒక వృద్ధ ఇండియన్ స్త్రీ అతనికి ఆహారం తెచ్చిపెట్టేది. బార్నీ ఆమెను చూసినప్పుడల్లా చిరునవ్వు నవ్వుతూ, తియ్యని మాటలు మాట్లాడుతూ, మంచి చేసుకోడానికి ప్రయత్నించాడు. అతని భాష ఆమెకు అర్థంకాక మొదట్లో ఆమె ఏమీ పట్టించుకునేది కాదు. నెమ్మదిగా అతడు చెప్పేదాని భావం గ్రహించి అతనిపట్ల సానుభూతి కనబరచింది.

ఒకరోజున అతడు మార్టిన్‌ను, స్వదేశాన్ని, తాను కోల్పోయిన స్వేచ్ఛాజీవితాన్ని తలుచుకుని తనలో తాను కుమిలిపోతున్నాడు. ఆ సమయంలో వృద్ధురాలు భోజనం పట్టుకుని ప్రవేశించింది. ఆమె వంక అతడు అతి దీనంగా చూశాడు. ఆ చూపులో భావం ఆమె గ్రహించింది. బొడ్డులో దోపుకుని వచ్చిన ఒక చాకునుతీసి పొరపాటున పడేసినట్లు అతని దగ్గిరగా పడేసి, గబగబ గుడిసెవిడిచి వెళ్ళిపోయింది. వెళ్ళేటప్పుడు తలుపులు మూసివేసి వెళ్ళింది. బార్నీ చాకు తీసుకుని చొక్కాలోపల దాచాడు. భోజనం చేశాడు.

చీకటిపడేదాకా ఓపిక పట్టాడు. ఊరు మాటుమణిగిన తరవాత, చాకుతో తన కట్లన్నీ తెగగోసివేసుకున్నాడు తలుపు గొళ్లెం గట్టిగా గుంజితే ఊడివచ్చేసింది. చాకు ఒకచేత్తో పట్టుకుని అరణ్యాల్లోకి దౌడుతీశాడు. కొంతదూరం పోయాక ఇండియన్లు అతడు పారిపోయిన సంగతి గ్రహించి వెంటబడ్డారు. అతడు ఎంత వేగంగా పరుగెత్తినా, ఇండియన్లు ఇంకా వేగంగా పరుగెత్తి అతన్ని సమీపించారు. వెనక్కి తిరిగి వారితో పోట్లాడుదామనుకున్నాడు. కాని ఇంతలో ఎదురుగా ఒక ప్రవాహం కనిపించింది. తెగించి అందులో దూకాడు. ప్రవాహం జోరుగా ఉంది. కొన్ని గజాలు పోయేసరికి, పెద్ద జలపాతం ధ్వని వినిపించింది. అందులోపడితే ప్రాణాలమీద ఆశ వదులుకున్నట్లే. అందుచేత అతి కష్టంమీద మళ్ళీ ఒడ్డుపట్టాడు. దగ్గరలో గుబురైన చెట్టు ఒకటి ఉన్నది. దానిమీదికి ఎగబాకి కొమ్మల మధ్య దాక్కున్నాడు. ఇంతలో ఇండియన్లు వచ్చారు. బంధితుడు ఎటు పారిపోయాడో వారికి తెలియలేదు. కొందరు జలపాతంకేసి పరుగెత్తారు. మిగతావారు ప్రవాహం ఎగువకు పరుగెత్తారు.

బార్నీకి అక్కడుంటే ప్రమాదం అనిపించింది. చెట్టు దిగాడు. చటుక్కున ఏదో ఉపాయం తోచింది. మళ్ళీ గ్రామాభిముఖంగా పరుగెత్తాడు. గ్రామంలో ప్రవేశించకుండా, చుట్టు తిరిగి రెండోవైపు చేరుకున్నాడు. అలా కొంతదూరం పరిగెత్తాక ఒక చిన్న ప్రవాహం అడ్డం వచ్చింది. అది ఇరవై గజాల వెడల్పు ఉంది. ఒడ్డున ఒక చిన్నబోటు కనబడింది. అందులో ఎక్కి బయలుదేరాడు. ప్రవాహం వేగంగా ఉండడంచేత, అతి త్వరలో అతడు గ్రామానికి చాల దూరం పోగలిగాడు. రెండు గంటలు ప్రయాణం

# ★ మార్టిన్ రాట్లర్ ★

చేశాక ఆ ప్రవాహం మొదట బార్నీ దూకిన పెద్ద ప్రవాహంలో కలిసిపోయింది. పడవ ఆ నదిలో ప్రవేశించింది. జలపాతం హోరు వెనుకనుండి మెల్లగా వినిపిస్తోంది కనుక దానిభయం లేదనుకున్నాడు. అయినా విశ్రాంతి తీసుకునేందుకు వీలులేదు. ఏక్షణానన్నైనా ఇండియన్లు తన్ను తరుముకుంటూ రావచ్చును. ఆ రాత్రి అంతా అతను పడవనడుపుతూనే ఉన్నాడు. తెల్లవారుతుండగా పడుకొని రెండుగంటలు నిద్రపోయాడు. తరవాత లేచి ఒడ్డున కనబడిన ఏవో చెట్లపండ్లు తిని, మంచినీళ్లు తాగి తిరిగి ప్రయాణం సాగించాడు.

మరునటిరోజున అతనికి ఒక పెద్ద నావ కనిపించింది. అందులో ఎవరో వ్యాపారస్థులు ఉన్నారు. వారెవరికీ ఇంగ్లీషు రాదు. వారు బార్నీని చూసి అతని దుస్థితిని గ్రహించి తమ నావలోకి తీసుకున్నారు. మూడు వారాలు గడిచాక వారు ఒక చిన్నపట్టణం చేరారు. అక్కడ ప్రజల ముఖ్యవృత్తి జోళ్లు తయారుచేయడం, సీసాలు తయారుచేయడం, రబ్బరు వస్తువులు తయారుచేయడం. అక్కడ బార్నీకి పని దొరికింది. కాని ఆపని అతనికి సంతృప్తి కలిగించలేదు. అందుకని అవకాశం రాగానే కొందరు వర్తకులతో కలిసి వజ్రాల గనులున్న ప్రదేశాలకి బయలుదేరాడు. అనేక వారాల ప్రయాణం అనంతరం అతడు గనుల ప్రాంతాల్ని చేరుకున్నాడు. కాని ఆ ప్రాంతం అతడికి నిరుత్సాహమే కలిగించింది. పెద్దపెద్ద గుహలుంటాయనీ, గుహాల్లో వజ్రాలు రాసులురాసులుగా ఉంటాయనీ అతడు అనుకున్నాడు. తీరా చూస్తే గుహాలూ లేవు; వజ్రాల రాసులూ లేవు. అయినా కొంత డబ్బు సంపాదించి మరీ పోదామని అక్కడే స్థిరపడ్డాడు. ఇప్పుడు మార్టిన్ కూడా వచ్చేశాడు కనుక ఎంత తొందరలో వీలైతే అంత తొందరలో సముద్రతీరానికి ప్రయాణమైపోవచ్చునన్నాడు.

మర్నాడు పొద్దున బార్నీ మార్టిన్ను గని వద్దకు తీసుకువెళ్ళాడు. అక్కడి పరిస్థితులన్నీ వివరించి చెప్పాడు. గనుల యజమానుల పరిస్థితి 'దొరికితే సిరి, లేకపోతే శని' అన్నట్లు ఉంటుంది. ఎంతో డబ్బు, ఎంతో కాలం వెచ్చించితే, అదృష్టం ఉంటే వజ్రాలు దొరకవచ్చును. లేకపోతే మట్టే మిగలవచ్చును. అక్కడ పనిచేసే నీగ్రో బానిసలది అసలు కష్టమంతా. రోజల్లా పనిచేస్తారు. మోకాలిలోతు నీళ్ళలో నుంచుని బురద కెలికి వజ్రాలు వెదకాలి. అందుచేత వారికి కీళ్ళవాతంలాంటి రోగాలెన్నో సంభవిస్తాయి. ఇంతపని చేసినా చాలీ చాలని తిండి; చాలీ చాలని గుడ్డ.

"ఈ బానిసల్ని చూసినప్పుడల్లా వీరి జేబుల నిండా వజ్రాలు నింపి, స్వేచ్ఛ ఇచ్చి వదిలేద్దామా అని బుద్ధి పుడుతుంది నాకు" అని బార్నీ గద్గద స్వరంతో అన్నాడు.

ఇలా వారు మాట్లాడుకుంటూఉండగా ఒక కొత్తవాణ్ణి వెంటబెట్టుకుని ఇంగ్లీషు దుబాసీ బార్నీ వద్దకు వచ్చాడు.

"నాకొక మంచి గుర్రం గాని, కంచరగాడిద గాని కావాలి మీవాళ్లు ఇవ్వం పొమ్మంటున్నారు నేను డబ్బిచ్చి కొనుక్కుంటానన్నా ఇవ్వమంటున్నారు" అని కొత్తవాడు బార్నీతో చెప్పుకున్నాడు

"డబ్బియ్యి. గుర్రం ఇస్తాను," అన్నాడు బార్నీ.

కొత్తవాడు డబ్బుమూట ఇచ్చాడు. బార్నీ అది తీసుకుని, దుబాసీతో చెప్పాడు ఏదో గుర్రం ఇవ్వమని.

ఇదంతా చూసి మార్టిన్ అన్నాడు: "ఆమనిషి ఎందుకంత తొందరపడుతున్నాడు గుర్రంకోసం?"

"ఏమో తెలియడంలేదు. వాడు దొంగ కావచ్చని మా దుబాసీ అంటున్నాడు. కొత్తవాళ్ళు అప్పుడప్పుడు ఇలా వచ్చి వజ్రాలు దొంగిలించి పారిపోతూ ఉంటారులే. వీడి తొందర చూస్తే నాకూ అనుమానంగానే ఉంది. అయినా ఆధారం లేందే వాణ్ణి నిలబెట్టి సోదాచెయ్యడం మంచిదికాదు. కనకనే వాణ్ణి అలా పోనిచ్చాను. వాడు సముద్రతీరానికి పోతున్నానని చెప్పాడు. మనం కూడా ఒక వారం రోజుల్లో సముద్రతీరానికి ప్రయాణం చేయబోతున్నాము. మార్టిన్! ఎన్నాళ్ళకి, ఎన్ని కష్టాలు గడిచి మళ్ళీ మనం సముద్రంలో ప్రయాణం చేయబోతున్నామో చూశావా? అంతా విధివిలాసం!" అని బార్నీ అన్నాడు.

(ఇంకా ఉంది)




## వీసె బెల్లం ఖరీదు ఎంత?

### 4

సూరయ్యకి లెక్కలు బాగా వచ్చునని గర్వం. అది పూర్తిగా గర్వం అనడానికి వీల్లేదు. చాలామంది వర్తకులకంటె అతనికి లెక్కలు బాగానే వచ్చు. కొట్టుమీదకి ఎవరేనా బేరానికి వచ్చినపుడు అతడు రూపాయి అణాపైసలు పలకమీద వేసి కూడుకోడు. నోటినే చెప్పేస్తాడు.

అయితే యిలాంటి సూరయ్యని పీడించడం ఆ ఊళ్ళో పెంకిపిల్ల జాణకి అలవాటు. అది కొట్టుమీదకి వచ్చిందంటే సూరయ్యకి కాపీ కొడుతున్న పిల్లాడికి హెడ్మాష్టర్ని చూసినట్టు ఉంటుంది. అది ఒకరింట్లో దాసీపని చేస్తోంది. ఓనాడు సంచీ, డబ్బులూ పట్టుకుని కొట్టుమీదకి వచ్చింది.

'ఏం జాణా, ఇలా వచ్చేవ్?"

'3 వీశెల బెల్లం కావాలి మామా!' సూరయ్య ఎడం చేత్తో గుండె ధైర్యంగా రాసుకున్నాడు. అంతేగద! 3 వీశెలకీ ఎంత డబ్బవుతుందో అంత డబ్బూ జాణ అక్కడ పెట్టింది. సూరయ్యశెట్టి త్రాసులో ఒకపక్క బెల్లంవేసి తూచాడు. బెల్లం 3 వీశెలకన్న కొంత ఎక్కువ తూగింది. బెల్లంముక్క విరిచెయ్యడం సూరయ్యకి యిష్టం లేకపోయింది. అతనికో చక్కని ఆలోచన తట్టింది. ఈ జాణని ఏడిపించడానికిదే సమయం!

'బెల్లం ఎక్కువ తూగింది, చూస్తున్నావ్ కదూ జాణా! ఈ పెద్ద ముక్క విరిచెయ్యడ మెందుకూ? మరో పావలా యిచ్చి ఏకముక్క పట్టుకుపో' అన్నాడు. జాణ తక్కువదా? తను అక్కడ పెట్టిన డబ్బులోంచి పది అణాలు తీసుకుంది.

'అంత శ్రమెందుకు మామా! నువ్వు ఇవ్వాడు తూచావే బెల్లం ముక్క, అందులో సగమియ్యి పట్టుకుపోతాను!' అంది.

సూరయ్యకి బుర్ర పని చెయ్యలేదు. ఇదేమిటి, దీని లెక్కలూ యిదీ! ఆక్షణంలో వీశెబెల్లం ఖరీదు ఎంతో అతనే మరిచిపోయాడు. ఇంతకీ, మనలో మన మాట, వీశె బెల్లం ఖరీదు ఎంతంటారు?

18వ పేజి ప్రశ్నలకు

**జవాబులు**

(1) నాలుగణాలన్నర.

(2) 6 అడుగులు.

(3) 16 పిల్లలు.

## అవసరాల రామకృష్ణరావు

## వరహాలయ్య వజ్రాలు ఎలా పంచాడు?

(గతవారం సమస్యకు జవాబు)

ఇలాంటి ప్రశ్నలకు ఒక జవాబు ఉంటుందనీ, ఆ జవాబు ఎవడికో ఒకడికి ముందే తెలిసివుంటుందనీ, వాడిని అడిగి తెలుసుకోడం తప్ప దీనికి జవాబు చెప్పే మార్గం మరొకటి లేదనీ, చాలామంది పిల్లల, కొద్దిమంది పెద్దల అభిప్రాయం. కాని ప్రతీ లెక్కనీ పరిష్కరించడానికి వీలుంటుంది, అది ఎంతటి యుక్తి లెక్క అయినా సరే. ఈ లెక్కని ఇలా చెయ్యాలి: నలుగురు కొడుకులూ ఎ, బి, సి, డి అనుకుందాం. ఆఖరికి ఒక్కొక్కరిదగ్గిర ఎన్నేసి వజ్రాలుండాలి?

# సమస్యలతో రణం

| ఎ | బి | సి | డి |
|---|---|---|---|
| 16 | 16 | 16 | 16 |

ఆఖర్ని పంచిం దెవరూ? డి. డి పంచకముందు ఎ, బి, సి లదగ్గిర ఎన్నెన్ని ఉండిఉండాలీ? ఎనిమిదేసి. ఇంకో ఎనిమిది ఎవ రిచ్చారూ? డి. అంటే ఎ, బి, సి లకు ఒక్కొక్కరికి ఎనిమిదేసి చొప్పున యిచ్చేసిన తరవాత డి దగ్గిర ఎన్ని వజ్రాలు మిగలాలీ? 16. దీనినిబట్టి మనకు తెలిసిందేమంటే డి పంచకముందు డి దగ్గిర 3 × 8 = 24 + తన దగ్గిర 16; అంటే 40 ఉండాలన్నమాట.

అలాగే డి పంచక ముందు పంచిం దెవరూ? సి. అప్పుడు ఎవరి దగ్గి రెన్ని?

| ఎ | బి | సి | డి |
|---|---|---|---|
| 8 | 8 | 8 | 40 |

సి పంచకముందో? ఎ దగ్గిర 4, బి దగ్గిర 4, డి దగ్గిర 20 ఉండాలి. అంటే సి పంచకముందు సి దగ్గిర 4 + 4 + 20 + తనదగ్గిర 8 మిగలాలిగా! = 36 ఉండాలి. ఇలా లెక్క చేసుకుని చివరినుంచి మొదటి కొస్తే:

| ఎ | బి | సి | డి |
|---|---|---|---|
| 16 | 16 | 16 | 16 |
| 8 | 8 | 8 | 40* |
| 4 | 4 | 36* | 20 |
| 2 | 34* | 18 | 10 |
| 33* | 17 | 9 | 5 |

వరహాలయ్య వరసగా నలుగురు కొడుకులకీ పంచిన వజ్రాలు 33, 17, 9, 5.



# ★ నల్లద్దాల కళ్లజోడు ★

(51 వ పేజీ తరువాయి)

సిం: సందేహ మెందుకండీ, సాక్ష్యం చెప్పడానికి!

న: ఐతే ఇలా దగ్గిరికి రండి.

సిం: (వస్తాడు.)

న: చేతులు చాపండి.

సిం: ఎందుకూ?

న: సంకెళ్ళు తగిలించడానికి.

సిం: సంకెళ్లా?

న: అవునండీ సింహాద్రిగారూ! తమరే హంతకులు!

సిం: నేనా!

న: సింహాద్రి గారూ! కాస్త తమాయించుకోండి. కథలు నిజమూ కావచ్చు. అబద్ధమూ కావచ్చు. కానీ అవి వాస్తవాన్ని ఎంతో కాలం దాచిపెట్టలేవు. సరిగ్గా యిక్కడ నిలబడి విశ్వం చలపతిని కాల్చి చంపాడని చెప్పారు కదండీ!

సిం: అవును.

న: ఇక్కడికీ చలపతిగారు పడి వున్న చోటకీ ఎంతదూరముంటుంది?

సిం: తెలుస్తూనే వుంది గదండీ! నాలుగు గజాలుండొచ్చు.

న: ఐతే నాలుగు గజాల దూరంలో నిలబడి ఈ విశ్వం ఆ చలపతిగారిని సరిగ్గా గుండెకు గురిబెట్టి కాల్చాడన్నమాట! అంతే కదండీ!

సిం: అవును మరి!

ఒక ఇంగ్లీషువాడు స్విట్జర్లెండ్ వెళ్ళి ఒక హోటల్లో దిగాడు. అక్కడ ఒక స్విస్ నౌకాశాఖాధికారి కనిపించగా చాలా ఆశ్చర్యపడి హోటలు యజమాని నడిగాడు: "మీ దేశంలో నౌకలే లేవుగదా? నౌకాశాఖ దేనికి?" అని.

హోటలు యజమాని "ఏం, ఎందు కుండకూడదూ? మీకు ఆహారశాఖా మంత్రి లేడూ?" అన్నాడు.

న: సింహాద్రిగారూ! పిస్తోలు బారుపెట్టి గురి తప్పకుండా కాల్చడానికి ముఖ్యంగా కావలిసిన దేమిటో చెబుతారా?

సిం: కావలిసిన దేమిటి? చేయి అదరకుండా వుండాలి.

న: ఇంకా.

సిం: కళ్ళు బాగుండాలి.

న: అంటే?

సిం: దృష్టి దోషం వుండకూడదు.

న: ఉన్నదే అది సింహాద్రి గారూ! విశ్వం వేసుకున్న నల్లద్దాల కళ్ళజోడు వెనుకవున్న కళ్ళు ప్రపంచాన్ని చూడలేవు. అనగా విశ్వం గ్రుడ్డివాడు! (తెర)

Printed and Published for Nageswara Rao Estates Ltd., by S. Radha Ktishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad.



మైసూరు, నిషాత్ ఉద్యానం

ఫోటో: ఎస్. వి. [illegible] —మైసూరు